# నాగరాజ వంశం

( అనుశ్రుత గాధ )



ధన్వంతరి:

కవిరాజు సత్యాల నరసిబాబు పాత్రుడుగారు,

చందనమత ప్రతిష్ఠాపనాచార్యులు,

నాగరాజ వంశ చరిత్ర నిర్మాత

# హెచ్చరిక

నా లిఖితపూర్వకమైన అనుమతి లేనిదే ఎవ్వరూ, ఎక్కడా, ఏవిధంగానూ, ప్రచురణ చేసి గాని, ముద్రణ చేసిగాని, ఏ వ్యాపారాలలో వుంచ కూడదు. దీన్ని అతిక్రమించినచో నా కష్ట నష్టము లకు బాధ్యులగుదురని ఇందుమూలముగా తెలియ జేస్తున్నాను.

ఇట్లు,

కవిరాజు,

సత్యాల సన్నిబాబు శాస్త్రులు.

# సంకల్పము.

ఈ వంశచరిత్రనుగూర్చిన యంశములు దెలిసికొనవలెనన్న విషయకాంక్ష పదునాలేండ్ల చిన్నప్రాయమునందే యంకురించినది. ఈ సంకల్పము నిర్వ్యాపార దినములలో (Golden age)లో ననగా 1925 సం॥న కలిగినది. నాటినుండియు నేటివరకు నీవంశమునందుగల పెద్దలనందరిని దర్శింపవలయుననుకొని ఆయాదేశములందుగల వయోవృద్ధులను నూటికి నూరుచుందిని దర్శించితిని. వీరిని వంశచరిత్రకు వలయుగాథలేమైన దెలిసిన దెలుపవలసినదిగా వినయవిధేయుడనై ప్రార్థించితిని. వారు తాత్కాలికముగా అనునందరు పోకనుపొందక గుసగుసలాడిరే కాని యిదమిత్థమని చెప్పగల పెద్దలొక్కరునూ నాకు లెటుపడలేదు. పైపెచ్చు నాకన్నా, వారికి తెలియును. వారికన్నా వీరికెరుకయని రిక్తవాక్యములం జెప్పుచుండుటచే (25 సం॥) మొదలు (30 సం॥) వరకు అనేకప్రయాణలకులోనై, పల్లెలు, పట్టణములు, తిరిగితని కాని వీరియాశ్రయింపులు నాకేమియు లాభకారికాలేదు. అయినను, "క్షత్రియులము" అన్న మాటమాత్రమునం దెరియవచ్చినది. అంతయేకాని యిదమిద్ధమని నిరూపించదగ్గ గ్రంథమేదియును వీరికి గోచరించినటులం దోచలేదు.

ఈ చరిత్రాంశములు సమకూర్చుటకు ధనమెంతయైననూ వినియోగించుటకు సిద్ధముగా నుంటిని. అప్పట్లో నాచేతులలో పసుపువేని కలదాయన్నట్లు శ్రీమంతులైన మాతాతగారగు "శ్రీగురుమహాంతు అప్పలస్వామిపాత్రుడు" గారి యండదయట్టిది. ధనమునకా? కొదువలేదు, పర్యటనమునకా? నవనవోన్మేలనమైన యౌవ్వనము అంకురించిన దినములు. పుట్టినవాది నేటివరకు చీకూచింతాలేని ఒక్కడను. వెనుక భారమా? లేదు, ముందార్థికభావన రాదు. శ్రీమంతుల కుటుంబములో రాజోపచారములతో, రాజసముగా పెరిగినవాడను, గనుకనే ఉగ్గుపాలనుండి పట్టిన పట్టు నెరువేరువరకునూ వదలని దీక్ష గలిగినది.

ఇప్పుడు నలుబది రెండవ ఏడు హైబడినది కాని బంగారు దినములలో బొంగరమునై రాజుగాని, మహారాజుగాని, ననుభవింపవలయు గాని సుఖము లనుభవించితిని. ఉత్సాహగా సంతోషమే సంతత వసంతము గాను, ఆనందమే నిత్యజీవిత పరమావధిగా నుండుట దుర్లభము అట్టి పలు కీర్తి పెక్కెండ్లు నొక్క పరి లభ్యమగుట కష్టముకాని యిది పూర్వజన్మ పుణ్యఫల విశేషముగాని లభ్యముకాదు. 1930 సం॥ నుండి, 36 సం॥ వరకు దక్షిణమున "మహారాజు మొదలు ఉత్తరమున సింహాచలము, ముఖలింగము, జగన్నాథము, మణిపురము, నాగపురము, బొంబాయి, కలకత్తా, మొదలుగాగల నగరములయందు పర్యటనచేసి అందుండుగల, శిలా, తామ్ర, శాసనములు ప్రాచీన భాండాగారములను పరిశోధించి చరిత్రకుపయోగించెడి సామాగ్రిని సేకరింప గలిగితిని.

1939 సం॥ లగాయతు మరల పర్యటన గావించి 1942 సం॥ వరకు నగరములను పేరులో ఏవిపట్నము, పల్లెలో గలవో వారివారి జనాభా సేకరింప కొంతవరకు గలిగితిని. 1942 సం॥ నాగరాజవంశచరిత్రను అనేకమంది చరిత్రకారులు, పండితులు, కవులు, విమర్శకులు, సాంగోపాంగముగా చూచి సాధ్యమైనంతవరకు క్లుప్తముగా ప్రథమ కూర్పు అచ్చువేయించు నుపాయము చూడమనిరి. వారిమాటలను శిరసావహించుటచేతను పెరుగ గ్రంథరచనను, సంకుచిత మార్గమున నడిపించితిని. మూలమే సంకుచితమైనదని చింతించుచున్న నన్నుద్ధరింపలో కూడమునిపల్లె కొడుపోత్యాత గ్రంథము వ్రాయవలసివచ్చినది, అదియును వారమునివములలో అచ్చువేయించ వలయునట, నేనా గ్రంథమా అమ్ముకొన లేదు. ఈ గ్రంథప్రకాశకులు అమ్ముకొని లాభము సంపాదించుటను వేయించుటలేను. స్వార్థములేనిపని పిచ్చివాడు సయితము చేయడను నటుల వారిరూపమున కీర్తిశేషులయిన శ్రీగురమ్మగారికి ఆవిష్కారము గావించు తలంపు నా కాగితములపైనుండి అచ్చు కాగితములు చూచు తలంపు. చరిత్రను యెంతవిస్తరించి వ్రాసిన నంత ప్రపంచకమునకు వినియోగించును. నేనే సాహసించి మూలగ్రంథమును ఆమూలాగ్రముగా అచ్చొత్తించెదమా అన్న శెంటుపొలము గజముస్థలము లేనివాడను. పైగా నమస్కారములతో మునిగితేలి ఆపత్సము

యములందు "సైన్యనారాయణా" అన్నవ్యక్తి. ఈవ్యక్తియే యిందును 15 సంవత్సరములబట్టి చేయుచున్నానే గాని, ధర్మసంస్థలకేం చెప్ప నేటిదనకా రోగిని డబ్బులడిగి యెరుగనామె, వారంతవారిచ్చిన గడ్డు. లేమన్న, యుద్ధ్య అట్టియున ఈరకముగ ధర్మము మార్గమెటులైనాయని తలంచెదరో యేమో? శ్రీరామునకు లక్ష్మణుడను తమ్ముడుండెనందురు అది పుస్తకములయందు వినుటయే. ప్రత్యక్షముగా నా పెదతండ్రి చంద్రయ్య పాత్రుడు గారి కుమారుడును, నాకు తమ్ముడు నాగేశ్వరరావు పాత్రుడు సునామధేయుడును నాభోజనభార నిర్వాహణ మంతయును విసుగులేక అనుదినముగా చూచుచుండును

1942 నుండి 5-5-1944 వరకూ ఈచరిత్రను వినుతలంపు గలవారు ఈసంఘమునందు వచ్చుటకైనా అగపడలేదు చరిత్ర అనగా అనేకములయిన అపమాన ఉపద్రవములతో ఉండుటచేతను చెవులకెక్కదని దలంచి వినగోరి వారికి కనులకైనా చూపుతలంపు గలిగినది. ఈచరిత్ర అంతయును చిత్రముగా చిత్రించు చిత్రలేఖకునికై వేచియుంటిని, ఇందుకు తగ్గ చిత్రలేఖకులు లేకపో లేదుగాని, ఒక చిత్రలేఖకునకు ను ఉద్దేశమయినంత మాత్రమున నా భావా [illegible] గారికి అవగాహనము గావలెనా? చరిత్రాత్మకమైన చిత్రములను లిఖించువాడు చరిత్రకారకుడై, పండితుడై, కవియై, శిల్పియైన చిత్రలేఖకుడైననాడు గావలయును. [illegible] సర్వశాస్త్రజ్ఞులు వంశజులు, హాస్యప్రియులు, కళావిశారదులును అగు బ్రహ్మశ్రీ సర్వసిద్ధి సూర్యనారాయణగారితో పరిచయభాగ్యము లభించినది. వారు నా మనోగతకోర్కెను మూడుమాసముల బాటు విని తమపరి నాచే లిఖింపించి పుస్తకమును తిలకించి అనేకమైన ప్రశ్నలను ప్రయోగించి తుట్టతుదకు ఇందుగల ముఖచిత్రమును వ్రాసి నన్ను నా సంఘీయులను ఆనందపరచిరి అట్టివిశ్వకర్మ ప్రముఖులయిన శ్రీ సర్వసిద్ధి సూర్యనారాయణగారికి శ్రీ శ్రీ శ్రీ సనాతనభగవానులు ఆయుర్భాగ్యములు ప్రసాదించుగాక.

5-5-1944 సంవత్సరమున శ్రీ తమ్మిన వేంకటస్వామి పాత్రుడుగారు, శ్రీ బెవర సోములు పాత్రుడుగారు శ్రీ రాంపిళ్ళ కొండలు పాత్రుడుగారు

మజ్జి కృష్ణమూర్తి పాత్రుడుగారు, శ్రీ సయ్యపు అప్పలస్వామి పాత్రుడు గారు, రాంపిళ్ళ అప్పలస్వామి పాత్రుడు) మొదలగువార సంఘీయులు కొత్త సేతు కార్మిక గ్రంథాలయమున సమావేశమై గ్రంథము అచ్చువేయించుటకు తగ్గమార్గాలను సూచించిరి. ఇందులకు ఉపసంఘము నొకదానిని నియమించి వారిద్వారా కార్యానుకూల ప్రయత్నములు చేయ దలపెట్టిరిగాని అచిరకాలములోనే ఉపసంఘము వారి అనాదరణవలన నైవారికి కూడా నిస్పృహజనించె కాబోలు భావికార్యక్రమమునగనే ఆలోచించుకోవలసినదిగాను నాప్రయత్నముపట్ల యెప్పుడుబడితే అప్పుడు వీరు చేదోడుగా ఉండుమనియు వాగ్దానము చేసిరి.

రఘువంశ, హరివంశముల బోలి చిరస్థాయిగా మన నాగరాజ వంశ సచ్చరిత్రను సాధ్యమైనంతవరకు కొక్కచోటున చేర్చివ గుండు యొకచరిత్ర కారులకీ సంఘచరిత్ర మార్గదర్శిగా ఉండును. అందులకు ప్రతి గృహస్థు వక్క పుస్తకమునైనా తీసికొనునను నమ్మకయే ఈ పైవారియున్న పై ప్రముఖులలో వక్కరే చేయించగరు. ఈ పని అట్టి నమ్మకము ఘట్టిగా వారికీ లేదే. నే నిప్పటికే ఈ సంఘ చరిత్రకై వేలాది రూప్యములను నా జీవిత సర్వస్వము ధారవోసి ఫకీరు నైతనే. ఇదేరూపమున ముద్రణాలయమున బ్రివేశపెట్ట గలను? యిందులకు చక్కని ఉపాయ మందినది. ఈనాటివరకూ నేను వ్రాసిన చరిత్ర భాగమునకు సంఘీయు లెవరునూ తోడ్పడవవసరము లేదు. నాకు శక్తి కలిగిననాడే ఆ గ్రంథము ముద్రింపించెదను. గాన తమరు తమ తమ వంశావళులతో మీ ఛాయా చిత్రరువుల నొసంగుడు. నేను అయిదు వేల గ్రంథములు ముద్రింపించనుంటిని.

| | |
|---|---|
| తమ బ్లాకుకుగాను | 6-0-0 |
| 5000 ఆర్టు పేపర్లకు ప్రింటింగు | 94-0-0 |
| 10000 కాగితములపై తమవంశావళులతో వంశచరిత్ర | 101-0-0 |
| వెరశి | 201-0-0 |

201 రూపాయిగాని లేక తమరే అచ్చువేయించి తమ వంశవృక్షముగా ఫొటోగ్రాఫ్ చిత్రపటములతో సహా పంపినను సరే లేదా యింటికి ఒక పుస్తకము చొప్పున నైకము పంపినను సరే, నేనే అభారము వహించెదను, అని 2-12-1948 సం॥ నగరమహాశయులకు విజ్ఞప్తి అను కరపత్రములను గ్రామ గ్రామముల వారికిగా 2 వేలకు పైగా తపాలా మూలముగా పంపియుంటిని. 8 వేలమందికి బెజవాడ గ్రామవాస్తవ్యులకు పేరుపేరు వరుస మూడుకానుల టిక్కెట్లు అంటించి బుక్ పోస్టుద్వారా పంపియుంటిని ఈ ఉద్యోగము 2 12-48 నుండి 1 -6-49 వరకూ ఇంతగా చేయింబవల్లు వారివారి చిరునామాలు దేవులాడి అడ్రసులు తెలియనివారి అడ్రసులకై దేవురించితిని, కాని పోస్టుద్వారా అయిదువేల మందికి పంపినను అదేమి చిత్రమో కాని వకరైనను ప్రత్యుత్తర మొసంగనైరి ఆభాగ్యమును కూడా నోచుకోని నిర్భాగ్యుడనైతిని. నాకరపత్రములు చేరిన వెంటనే శ్రీయుతులు సుఖనాని బ్రహ్మానందనాయకులు పాతూరిగారున్నూ, శ్రీ పిళ్ళా బుచ్చన్న పాతూరిగారున్నూ, శ్రీ పిళ్ళా అప్పలనరసయ్య పాతూరిగారున్నూ తెలిగ్రామునకారిగా నాకరపత్రములు చేరిన వెంటనే అమితప్రోత్సాహముతో జవాబొసంగిరి. ఈ గ్రామమునగల పెద్దలను నాలా సంవత్సరాల తరబడి వకసభగావించమని అర్థించితిని కాని, అక్కడి ఉద్యమమే బియము ఈనాటివరకూ జరుపప్రయత్నము చేయువారి సంఘమున కానుపింప నైరి. తదితర గ్రామములవారుకూడా యించుమించుగా వకతెగనాడే అగు పించుకొనుటలో వెనుదీయనైరి.

ఈ గ్రంథ రచన యేమరో వ్యక్తియేని వ్రాసియుండినయెడల నేను మాత్రము ఇంతకాల మీ గ్రంథరాజమును అజ్ఞాతవాసము ననుభవించ నిచ్చేటి వాడను కాను అన్న సంగతి విజయవాడ ప్రముఖు లందరికి విశదమే.

ఇందులకు నేను చేయించిన అనేకములయిన పండిత సభలున్నూ, మహాకవీశ్వరులను ఈ బెజవాడ గద్దెపై నిలిపి నా చేతులమీదుగా బంగారు అందెలను వేసి, బ్రహ్మ రథాధి అంబారీ ఉత్సవాలతో కనకాభిషేకములు చేయించుటయే సాక్ష్యము. యువకవుల కంకణములు, శిల్పుల గద్దెరలు,

గాయక సార్వభౌముల సన్మానములు ప్రత్యక్షములే. ఈ విధమున లిఖియించుకొనుట గొప్పలకు గాదు. చరిత్రయం దిమిడియుండుటకై నా హృదయావేదనతో ఇం దుదహరించిన వాంశములుగాబట్టి అతిశయోక్తులు కావు. ఆత్మస్తవముగా దలంచకుందురు గాక.

5-11-1948 సం॥ వారి వారి వంశావళులు వేయించుకొనుటకు గాను శ్రీయుతులు తిమ్మన వెంకటస్వామి పాత్రుడుగారువద్ద రెండు పుస్తకములుకొని తెప్పించి వారిచేతితోనే పసుపుకుంకుమలు బూసి, ప్రథమ దళముగ వారే 201 రూపాయలను లిఖించి 27-12-1948వ తేదీన పైకము రొఖరూపముగా నొసంగిరి ఇది జరిగినతోడనే శ్రీ రాంపిళ్ళ కొండలరావు అండ్ బ్రదర్సువారు 8-1-49 తేదీన 201 రూపాయ రొఖ మొసంగిరి. 7-3-1949వ తేదీన శ్రీయుతులు బెవర సోములు పాత్రుడు గారు 201 రూపాయి రొఖ మొసంగిరి. తదుపరి గుజ్జారు పైడన్న పాత్రుడుగారు 201 రొఖము నొసంగిరి. మొత్తము ఇప్పటికి 800 రూపాయిలు మూలధనము రొఖరూపమునను, 800 రూపాయలు లిఖితరూపమునను గలవు. పద్దులువేసినవారిని నేను అడిగియుండలేదు, అడిగినవెంటనే వారు ఇచ్చుటకు సిద్ధముగానే యున్నారు. అడగకుండుట నాలోపమేగాని పద్దులువేసినవారిది కాదు.

నేనిదివరకు 1000 రూపాయలకు పైగా ఖర్చుపెట్టి 1942సం॥'దూకు' డను పుస్తకము 1948 గాంధీజీ అమర"పట్టాభిషేక" మను గ్రంధములను వాడబ్బేగాని, వకరిని ఆశ్రయించి చేయించినవిగావు. అట్లే ఈపొత్తమును అచ్చొత్తించుటకు వంశావళులు గావద్దా?

ఈ బెజవాడ కులజనాభాకొరకై యెందరెందరు ప్రముఖులను ఆశ్రయించితినో వారి వారి హృదయములకే గోచరము. ఈ మొత్తం జనాభాలో వారి వారి గోత్రములుగాని, వారి వారి ఛాయాచిత్రములుగాని, సంఘుగాథలుగాని, పంపిన ప్రముఖులు ఈనాటివరకుగా నరారైరి.

శ్రీయుతులు సుఖవాసి బ్రహ్మాంణనాయకులు పాత్రుడుగారు మాత్రము వారి పూర్వచరిత్రను, వారి చరిత్రను, వారి ఛాయాచిత్రమును వెంటనే పంపియున్నారు వీరిచ్చిన ప్రోత్సాహము ప్రశంసనీయము. సర్వకాల సర్వావస్థలయందు వారికి నా అభివందనము లర్పించుచునే యుంటిని. మరి వక గొప్పవిశేషవార్తను తమకు చెప్పి యింతటితో విరమిస్తాను, వినండి.

1943 సం॥ మరల ఉత్సాహపూరితుడనై పూర్వము కరపత్రము లందు కొనిన అచలమూర్తులను సందర్శించవలెనని ప్రయాణమైతిని. మొదటుపుట్టినమే రాజమహేంద్రవరమైంది. ఆపవిత్రనగరములో మహోన్నతి వారున్నారు ఆయమ్మ పేరైతే వ్రాయను గాని వెధవగాలు అని మాత్రము ఆమెను యెరిగినవారందరూ తెలుసుకొందురు. ఆసోదరి నాఉద్యమమంతయు విని బ్రతుకు తెరువుకు మంచిమార్గమాలోచించితివి అన్నది. ఆపలుకువిన్న నాగుండె ఉలికి పడింది. అరే రాజులచే నమస్కారములందే ఆయుర్వేదవిద్య నభ్యసించిన నేను కులవిద్యను లక్ష్యముంచక ఈచరిత్రరచనకు దిగుటయే ఈమె నన్ననగలిగినది. నాకొరకు నేక ఆస్తులుఇంటిచుట్టూ పడిగాపులుండే వైద్యమునువదలుటయే ఈలాంటి వెధవలు అనగలుగుట–నేను వినుట. కులచరిత్ర యెవరికి కావలయును ఇల్లు, వాకిలి, తోట దొడ్డి కులముగల గృహస్థులకూ పెండ్లాము పిల్లలు గలవారికిగాని నాబోంటి యేకాకికి కులమేలా అనే మెలుకువ గలిగినదిగాని, కులమున బుట్టినందులకు కుల ఋణము దీర్చుటయూ, వక వెధవరాలన్న కర్ణ కఠోర వాక్కు లాలించి విరమించుటయూ అన్న సందేహము తీరక యీకవిలికట్టను దట్టముగ కట్టి కావెడిపెట్టియుంచెడి ఈచరిత్రకు వలయు గ్రంథము లన్నియు అందిడ, ఆ పైన వక చీటీని అంటించితిని. ఆ చీటీపైన "ఆఫ్టర్ మై డెత్, సీ ది బుక్" అగాన నేను చచ్చిన తదుప రీపుస్తకమును చూడు అని?

25, యేడులు యేకదీక్షగా చేసిన నా కృషి కింతకన్నా బహుమానమేమిగా వలయును.

అయితే ఆ వేధవరాలు చాటుచున్న మాట నా సువర్ణ ఘంటముతో లిఖించక తప్పినది కాదు. నిజముగా ఈమె ఈ కులమునందే పుట్టినదైన ఈ పొల్లుమాట తనది తనకే చెందును.

నాయందు కాదు నాజాతి మొత్తములో యాచకుడు లేడని చాటుచున్న నన్నే యాచకునిగా దలంచిన వేధవముండ వాక్కులు చెవినిడరాదు గాని, ఇట్టివారివలననే సంఘమీ దుస్థితి నున్నదేమోనని వ్రాసితిని.

దేవునే లక్ష్యపెట్టని నేను యింటింటికివెళ్ళి సంఘాభ్యుదయ మార్గములను చూపు స్వీయచరిత్రను, అవివేకులనుండు, ఆదికాలమునుండియు పరివర్జించుటకూడా తప్పయేమో? నని పూర్తిగా ఈచరిత్రయందు విరక్తి బొంది నాకులవృత్తి నాజన్మహక్కు అయిన వైద్యవృత్తియందు మరల దిగితిని. ఇంతలో కీర్తిశేషులయిన శ్రీ బాయన కనకయ్య పాత్రుడుగారి స్మారకసంవత్సర సందర్భమున, శ్రీ దయానంద పొన్నాల రాజయాఖ్య యోగీశ్వరుల వారున్నూ, శ్రీ నిర్మలానంద దాసరి బ్రహ్మణయ్య చౌదరిగారున్నూ నన్ను రావించి, ఈకులచరిత్ర వినిపించవలసి దిగా కోరిరి. పెద్దలు అయిన వారి మాటలకు యెదురాడరాక నాప్రతిననే సరకుచేయక ఆరాత్రి శ్రీ బాయన కనకయ్యగారియింట ఉపన్యాసరూపమునబలవంతబ్రహ్మాండంగా చరిత్రను వెలిబుచ్చితిని. అంత ఆభక్తబృందము వారానందించిరి. విన్నవారిరక్తనాళముల యందు క్షాత్రరక్తమొకతూరి ప్రవహించినది. శ్రీ కనకయ్యపాత్రుడుగారి సహపత్ని అలువేలమ్మగారు ఆకార్యక్రమమునకు ఇలువేలుపై వకకద్దరు శాలువాను బహూకరించిరి. ఈ గ్రంథరచనకు ప్రథమ సన్మానము. నాకా బంగారు గంతారవ తులా కోటి సన్మానమందితినని నా హృదయము ఉత్సాల తరంగతాళిప్రమాణమున లేచి అంబరవీధిని మేఘకుంభములపై స్వారిదీసినది.

సన్మానదాత అయిన అలివేలమ్మగారికి ఆయురారోగ్య భాగ్యములు భగవతి ప్రసాదించునుగాత అని దీవించినది.

ఇంతలో శ్రీ గురవమ్మగారు పరమపదించుటతో వంశ చరిత్ర అందరను తెలియునట్టుల మూల గ్రంథముయొక్క ఉపోద్ఘాతమును ప్రచురించుటకు తమ శిష్యుల కొసంగవలసినదిగా మరల శ్రీ శ్రీ శ్రీ పొన్నాల రాజయాఖ్యయోగీశ్వరులు కోరిరి. ఈ విధముగానైనా ఈ గ్రంథరాజ ఉపోద్ఘాతము చదివినవారలు మూల గ్రంథమందు తమ తమ వంశావళులు చేర్చుకొందురేమో నన్న ఆశాజ్యోతి నాలో ప్రకాశించి మీకీ రూపము చూపినది. కాందుగా తమరందరూ ప్రకాశకులుగానైనా చేరి వక్క పుస్తకమును తీసికొనుటకు నిర్ణయము తెలియపరచగోరుచున్నాను. లెండు! త్వరపడుడు!! దీపమున్నప్పుడే మీ మీ మూలధనమును వెతకికొనుడు!!!

జాతి మతములు ఏకముగా నున్న ఈ దినములలో సంఘ చరిత్రలు అనవసరములని తలచుట పొరపాటు. కులగౌరవము గల యింటి కోడలైనను శ్రేష్ఠమైనదే అను లోకోక్తి గమనింపుడు. ఒక ప్రత్యేక కళాకౌశలముగల సనాతన నాగరికత గల చరిత్ర మతములో లీనమై గూఢముగా నున్నప్పుడు మూఢముగా దలంచుటకన్న సమ్మిళితమైన ఈ రెంటినీ విడదీసి ఐతిహాసిక దృష్టితో ప్రాచీన చరిత్రను పరిశోధించవలయును. ఈపని బహు కష్టసాధ్యము. దీనిలోవున్న శ్రమ అనుభవజ్ఞులకేతప్ప సామాన్యుల కిది సామాన్యమె!

సునిశిత, సులలిత, సుకుమార, సుందర, రశికజన జీవాంబుధి నానందడోలికలందు దూగాడు సుకృతము ననుభవించుచూ, వేద వేదాంత పురాణేతిహాసములను మథించి, తేలిన యమృతమును, రాగాజ శాసన ముద్రలను గదలించి సేకరించిన రవ్వలను, భూగర్భమును పెకలించి సంగ్రహించిన వైడూర్య గోమేధికములను, సముద్ర పర్యటనలో ముత్యములాది నవరత్నములు సేకరించి నా బుద్ధి యను సూత్రమున గ్రుచ్చి సంఘమాత పాదపద్మముల నలంకరించి ఋణ విముక్తుడ నైతిని.

---

# మనవి

నానాభాషాసముద్రులే రచించిన చరిత్రలు విమర్శకులకు గురియగుట విదితమే. గీర్వాణాంధ్ర భాషాజ్ఞానమెరుగని నాప్రయత్నమందుగల లోపము లుండవచ్చును నా బహుసంవత్సరాల బట్టి పరిశోధనలుచేసిన డాక్టర్ బండార్ కర్, బాలగంగాధరతిలక్, ఫెర్గూసన్ మొదలయిన ప్రముఖులకే లోపాలోపములున్నవి. చరిత్రపరిశోధకులు, పండితులు, విమర్శకులు, కవులు, మతమతాంతర మహామహులు సాంగోపాంగముగ జదివి తమకు తట్టిన సహేతుక దోషములను నాకుం దెలుపుదురను ఉద్దేశముతో ఈగ్రంథమును ఈవిధముగ ప్రథమతహా ముద్రించుటైనది. నాచే లిఖియింపబడిన మూల గ్రంథమునకు సూచనగా ఇది వెలిబరచితిని. గావున అభిజ్ఞులు అవసర మార్పులను తెలియజేసెదరనియు, తమ ప్రోత్సాహముతో నాగరాజ వంశచరిత్ర ముద్రింపించెదరనియు మనవిచేసుకొను చున్నాను.

ఈగ్రంథరచన అంతయూ ఆరురోజులలో చిత్తుప్రతులను తయారుచేసి అచ్చుకొసంగి నేనే అక్షరవిన్యాస మొనరించుకోవలసి వచ్చినది. దానంజేసి ఈగ్రంథప్రకాశకు లిచ్చిన ఆరుదినములలో అచ్చుఅయిన గ్రంథమందు గల పొరపాటులు, శకదోషములు కథాభాగము చక్కగా తిలకించి తమ - మూల్యాదరణాభిప్రాయములు పంపప్రార్థన. నాతోబాటు యీ గ్రంథ ముద్రణయందు శ్రమచేసిన శ్రీ హైమవతీప్రెస్ లిమిటెడ్ వారికి నా కృతజ్ఞత.

ఇట్లు,
గ్రంథకర్త.

# గురుదేవుని ఆశీస్సు

ఉ తి క్క్యా ప ద్దా!

ఈ మనిషెవర్రో! ఈ అవతారమేమిట్రో! ఆ...... నేనిక్కడా చూడ్లా, అమ్మయ్యా! ఉండండి కాస్త తమాయించుకోనీండి.

ఆఁ... పేరేమిటి? వృత్రాసురుడా? సముద్రంలో మకాం పెట్టి యెన్నాళ్ళయిందో? సముద్ర నివాస హేతువునై జలచరాది జీవ సహవాస కారణమై అనంతకోటి జీవులకు ఆప్త బంధువునై, శత సహస్ర కోటి శీర్షాలు కలవాడై యెంత బరువు యేకదీక్షగా మోస్తున్నాడో చూడండి.

అతనికి కుల, మత, జాతి, వర్గ, పార్టీ, పక్ష, కక్ష, భేదాలు లేకుండా అందరూ తనకు కావలసినవారని యీ అఖండమైన భూమండలాన్ని తలకెత్తుకొని మోస్తున్నాడు.

ఆహా! ఇతఁడే నాయకుడు. ఇప్పుడు కావలసినవాడు. ఈ మహానాయకుణ్ణి ఈ తరుణంలో కనిపెట్టి, నిలపెట్టి, చూపెట్టి, ఈ నాగరాజుల్లో నవోదయ యుగాన్ని చుట్టి, మానవ జీవిత మహీమండలాన్ని మహోదయంలోకి తెస్తున్న మా 'నర్సిబాబు' నిక్కచ్చైన 'నవర్సుబాబు'.

అసలు కావలసింది ఐక్యత, యోగ్యత, భాగ్యత. ఇవి తెచ్చిపెట్టని చరిత్రలు చాలా ధరిత్రిపై తలెత్తినై.

కం॥ ప్రతి జాతి హిష్టరీకిన్
క్షితి కీర్తిర్యాలు పుట్టి చెడిపోయి గతుల్
బ్రతుకే మరచిం దిక ఉ
న్నతమైన చరిత్రయేది నాయుడుబావా॥

ఈ మాటలో సత్తా తెలుసుకొనే పెద్ద తలలన్నీ సత్యాల నర్సిబాబు రచించిన 'నాగరాజనందాన్ని' విశ్వసించి తీరుతారు.


Andhra Bernard Shaw
**Vedanthakavi,**
***Kavita Samsthanam,***
**Vijayawada.**

ఆంధ్రా బెర్నార్డ్ షా,
వే దా ం త క వి,
కవితా సంస్థానం, విజయవాడ.
18—2—51




# ప్ర కా శ కు లు.

శ్రీకారమునకే ఏదేని ప్రారంభించుట సనాతన సాంప్రదాయము. ఇపుడు ప్రచురించిన "నాగరాజవంశ చరిత్ర" మూలకులైన నగరాలను, నగరములను గురించి వ్రాసియుంటిమి. యీ చరిత్ర మూలగ్రంథమునందు గృహనామములు చాలా భాగము నిర్వచనచేసియుంటిని. శ్రీకారమే ప్రధానమగుటంజేసి "తమ్మిన" గృహ నామము ఉదాహరణకు నిర్వచించుచుంటిని.

గీ॥ తమ్మి కొలను కోనేరనఁ దనరె పేళ్ళు

(ఆం॥ శ॥ ని॥ వారి వర్గు 108వ పేజి 254వ॥ పద్యము.)

అనగా పుష్కరిణికి పేర్లు.

గీ॥ తమ్మి యన నీటి బుట్టవు

(ఆం॥ ప॥ ని॥ వారివర్గు పేజి 110 పద్యము 2.2)

నీటియం దుద్భవించిన కమలమునకు "తమ్మి" యని పేరు. తమ్మి యందుద్భవించినది "శ్రీ". అనగా లక్ష్మి. దీని కటాక్షము కలవారే తమ్మినవారు.

సీ॥ పుడమి జంబూద్వీపమునకును తొలి దీవి
దనరు పక్షద్వీపమునకు జువ్వి

దీవి:యూ, పుష్కర ద్వీపంబునకు దమ్మి

. . . . . . . . . . . . . . . . . . . . . . . . .

(ఆం॥ ప॥ ని॥ వారివద్ద పేజి 112 పద్యం 279)

తమ్మిదీవి యనగా పుష్కర ద్వీపమునకు పేరు. తొలుత యీ దీవులనుండి వలస వచ్చిన ధనికవర్గమే యీ తమ్మినవా రనంబడుదురు.

ఇందుదహరించిన తమ్మినవారి వంశవృక్ష మూలపురుషులైన యల్లయ్యగారు దైవభక్తిగలిగి వ్యవసాయాది వృత్తుల చే జీవించుచుండెడివారు. వీరు విశాఖపట్టణ జిల్లా వాస్తవ్యులు. వీరికి ముగ్గురు తేజోవంతులయిన కుమారు లుద్భవించిరి. ఇందు అగ్రజులు పెద రామయ్య అనే గురవయ్యగారు. వీరు 'శీలం' వారితో వియ్యమంది యల్లమ్మగారిని ధర్మపత్నిగా స్వీకరించిరి. ఈ పుణ్యదంపతులిరువురు జ్ఞానమార్గానువర్తులై అచల ఋషి రామడుగుల శివరామదీక్షిత గురుపీఠ శిష్యకోటిగా నుండి ముక్తి నందిరి. వీరి కుమారుడగు పానకాలు పాత్రుడుగారు వీరి సహపత్ని గురమ్మ నామధేయురాలు వీరుభయులును పూర్వాచార పారీణ పరంపరులై అచలరిషి రామడుగుల శివరామదీక్షిత గురుపీఠమునకు అక్షయులైరి. శ్రీగురమ్మగారు అనేకములైన పుణ్యకార్యముః లొనరించిరి. ఈమె చేయు దాన మతి గుప్తదానము ఈ గురమ్మ సునామధేయముతో దివ్యమైన సత్రమొకటి నిర్మించిరి. ఈ దంపతులకు ఆయిదుగురు సంతానము. అందు రాములు అను నాతడు అతి బాల్యముననే

భౌతికమును వీడెను. రెండవవారు అప్పారావు సునామధే యులు. ఈతడు రసికశిఖావతంసుడై ఆడినది ఆట పాడి నది పాటగా ఈతనికి మనమలు కలుగువరకు జరిగినది. ఇహ మనుమరాండ్రను గని వారినుండి మునిమనమలను గాంచువర కీవ్యక్తి ధన్యజీవనమే చేయగలుగునటుల యేర్పాటులు గావిం పబడినవి. ఈతని కనిష్ఠ సోదరి శీలము బుల్లెమ్మ (అక్క-య్యమ్మ) గారికి సంతానము లేకపోవుటచే ఈ తమ్మునియం దభిమానము మెండు. ఈ అక్కయ్యమ్మగారు ఇంటిపేరును సార్థకపరచిన పరమసాధ్వి. పుట్టినింటికిని, మెట్టినింటికిని వన్నె తెచ్చిన గుణబిడ్డ. ఈమె నిస్సంతానముగా వైధవ్య మనుభ వించుచున్నది. భర్త స్వర్గసీమ చేరిననాటినుండి అచల దీక్ష బూని నిజగురునాశ్రయించి గీతాభాష్యములతోను, వేదవేదాం తగోష్ఠితోను నిత్య అన్నదానము చేయుచు ఇహమునసే మహ త్తర సద్గోష్ఠిని ప్రొద్దుపుచ్చుచున్నది.

శ్రీ గురువమ్మగారు సమాధికి వేంచేసిననాటినుండి తల్లి ఋణంబు దీర్చు నుపాయంబు లరసి, అందులకు తగ్గ శాస్త్ర పరిశోధకుల పలుకులకు తోలకరియై ఆమె శీలమును చూపు చున్నది. సప్తసంతానాధికము లొనరించ కంకణముకట్టినది. ఈ సుగుణవతి వీరోచిత శుభకార్య కలాపములో ఈ గ్రంథం (నాగరాజవంశ చరిత్ర) నాందిని వెలువరుచు టొకటి. అట్టి శ్రీ అక్కయ్యమ్మ గారికి ఆయురారోగ్య భాగ్యము లొసంగి ఈమె జననికి స్వర్గ శయ్యాయం దాత్మ శాంతిని బాడుకొల్ప నా నుడు లీ విధమున లిఖియించడమైనది.



ప్రకాశకులు

కీ॥ శే॥ తమ్మెన గురవమ్మ గారు

# తమ్మిన గురవమ్మగారి వంశ వృక్షము.

మూలపురుషుడు: యెల్లయ్య, భార్య యెల్లమ్మ

(1) పెదరామయ్య (2) యెల్లయ్య (3) గురవయ్య అనే చినరామయ్య వీరి భార్య యెల్లమ్మ

(1) పానకాలు వీరి భార్య గురవమ్మ

(2) దాలప్ప అనే తాతయ్య వీరి భార్య చిన్నమ్మ

అక్కాయమ్మ భర్త పోతిన మునుస్వామి

(1) పానకాలరావు (2) కొండలరావు ఆడపిల్లలు యిద్దరు

సత్యనారాయణ యిద్దరు ఆడపిల్లలు

(1) రామానుజమ్మ (2) బుల్లెమ్మ అనే అక్కాయమ్మ (3) దుర్గాంబ (4) రాములు (5) అప్పారావు భార్య చిన్నమ్మ

(1) సత్యనారాయణ (2) రాజేశ్వరమ్మ (3) అచ్యుతరావు (4) మహేశ్వరమ్మ

(1) గోవర్ధనరావు (2) రామచంద్రరావు

# తమ్మిన గురవమ్మ తల్లిగారి వంశం

రాంపిల్ల వెంకటస్వామి, భార్య అమ్మన్నమ్మ

1 అచ్చాయమ్మ — భర్త శిరంకామయ్య
2 కనకమ్మ — భర్త పీధి యల్లయ్య
3 యల్లయ్యమ్మ — భర్త తమ్మిన గురవయ్య
4 గురవయ్య — భార్య సత్తెమ్మ
5 వెంకాయమ్మ — భర్త బాయనలచ్చయ్య
6 గురవమ్మ — భర్త పీసా సోములు

1 అచ్చాయమ్మ సంతానం:

1 గురవమ్మ 2 సత్తెమ్మ 3 వేంకాయమ్మ 4 అప్పలస్వామి

4 అప్పలస్వామి — భార్య బుల్లెమ్మనే అక్కయమ్మ



కీ॥ శే॥ శీలం (శీరము) అచ్చెమ్మగారు.

వీరు గురవమ్మగారి జనని.



శ్రీయుతులు రాంపిళ్ల సత్తెమ్మగారు

కీ॥ గురవమ్మగారి సోదరి,

# కులదేవతా స్తవము

చ॥ బహువన పాదపాద్రి కుల, పావన పూర్ణ సరస్సరస్వతీ
సహిత మహా మహీధర మ, జస్ర సహస్ర ఫణాళిఁ దాల్చి య
స్సహ తరమూర్తికిన్ జలధి, శాయికిఁ బాయక శయ్యయైన యా
య్యహిపతి దుష్కృతాంతకుఁడ, నంతుఁడు మాకు ప్రసన్నుఁడయ్యెడున్ 1

చ॥ అరిది తపో విభూతి నను, రాయల బాధలు వొందకుండఁగా
సురగుల నెల్లఁ గాచిన వు, హోరగ నాయకుఁ డా నమత్సు రా
సురమకుటాగ్ర రత్నరుచి, శోభిత పాదున కద్రినందనే
శ్వరునకు భూషణం బయిన, వాసుకి మాకు ప్రసన్నుఁడయ్యెడున్. 2

ఉ॥ దేవమనుష్యలోకములఁ, ద్రిమ్మరుచున్ విపుల ప్రతాప సం
భావితశక్తి శౌర్యులు న, పార విషోత్కట కోప విస్ఫుర
త్పావక తాపితాఖిల వి, పక్షులు నైన మహాప్రభావు లై
రావత కోటి ఘోర ఫణి, రాజులు మాకు ప్రసన్నులయ్యెడున్. 3

ఉ॥ గోత్ర మహామహీధర ని, కుంజములన్ విపినంబులన్ గురు
క్షేత్రమునన్ ప్రకాశగతి, సేవలనొప్పిన పార్శ్వసేనుఁడై
ధాత్రి పరిభ్రమించు బల, దర్ప పరాక్రమ దక్షుఁ డీక్షణ
శ్రోత్ర విభుండు తక్షకుఁడు, శూరుడు మాకు ప్రసన్నుఁడయ్యెడున్. 4

# II

ఉ॥ నాకధరా రసాతల క, న బ్భువనంబుల సంచరింపుచు౯
వీక్షితావనంబున క, వేల సుధారసధారఁ జిమ్ము చ
స్తోక రుషన్ విషాగ్నులను, దుష్టుల శిక్షణమాచరించు క
న్నాఁకగు నాగరాజ నివహంబున కేను నమస్కరించెదన్. 6

శా॥ లీలా లాలిత సర్వలోకుఁడగు శ్రీ లీలావతీ భర్తకున్
హాళిన్ బొల్చిన తల్పమై సుధిషణా ప్రాంచన్మహాంబోధి యా
ప్రాలేయార్క విభూష భూషణమునై రాణించి రత్నాళిచే
నోళిన్ పొల్చు మహా ఫణీంద్రుల కివే నర్పింతు నాజోతలన్. 6

ఉ॥ కారణయుక్త వైరమునఁ గారుణికత్వమునన్ సదా
చారముగా సమస్తమగు, సజ్జన మండలి కిమ్ముఁగూర్చు వం
దారు మనోహరంబయిన నా, డెమునం దనరారు జ్ఞాన గా
నార భటీ విలాసులగు, నట్టి మహోరగ పంక్తి నెన్నెదన్ 7

ఉ॥ వేయి మొగాలతోఁడ నిరు, వేలగు నాల్కలతోఁ బరాత్పరున్
హాయిగ జూచుచున్ బొగడు, చంబుజ సంభవ వక్త్రజాతవే
దాయత నాయమాన విమ, య ప్రకటీ కరణోక్తిధాతయా
ధీయుతుడైన శేషున కతి ప్రమదంబున నేను మ్రొక్కెదన్. 8

శా॥ ఆ పాతాళ విధాతృ లోకనుల కత్యంతంబుగా భీతి వే
వే పుట్టించు తపో విభూతి నిధి ధీవిస్తారుఁడా వృత్రుఁడే
శ్రీ పారమ్యల సత్కులంబునకు కర్తృత్వమ్మున్ మించునో
ఆ పాపౌఘాంతక నాగమండలి కిదే ప్రాంజల్యనీకం బగున్. 9

శా॥ ప్రాజాపత్యమునన్ జెలంగు నల త్వాష్ట్రి బ్రహ్మ తేజంబుతో
నాజానేయమునం బలెన్ యశము దిగ్వ్యాప్తిం బిసాళింప స
ద్రాజీమండల మండనం బయిన సర్వశ్రేష్ఠ వంశానకున్
సాజంబం చనరాని భక్తి గరిమన్ సాష్టాంగముల్ సల్పెదన్. 10

మ॥ కుళికానంత ఫణీంద్ర తక్షకులచే గోమొంది కర్కోటకున్
కలి మార్గాంతకు వంశమండనము గా గాంచంగ నా నాగమం
డల ముం గుండల శీర్షభాగయుతమున్ నానా మహా వైదుషీ
లలితాకార మనోజ్ఞభావనము నుల్లాసంబునన్ గొల్చెదన్. 11

నాగ స్తవము సమాప్తి.

# ఉపోద్ఘాతము

అతి మనోహర జగత్కల్యాణాంచితమునకై వెలువడిన వేద, వేదాంత పురాణేతిహాస శాసనాది కాలమునుండి రవి యస్తమించని బ్రిటిష్ పరిపాలనా ఘట్టములలో గల చరిత్ర పరిశోధనలలో వన్నెకెక్కిన ''నగరాలను'' గూర్చి భూగర్భ, భూనిక్షేపకాది శిలా, తామ్ర, శాసనముల చేతను, ప్రాచీన భూగర్భ చిహ్నముల నుండియు, వీరి పూర్వుల రాజ్యపాలనా కౌశలము లలితకళా పోషణము, మొదలుగాగల చరిత్రాంశము లను వేతెరంగుల చాటుచున్నను నేటి నవయుగచరిత్రకారు లే కారణముననో! "నగరాల" సంఘ చరిత్రను తలంపకుండుట భావికాల భాగ్యోదయానికే తీరని కళంక మనక తప్పదు.

బహు ప్రాచీనము నుండియు అపౌరుష, హేయము లనెడి వేదములందు పెక్కు చోట్ల ఆర్యప్రభువైన దేవేంద్రునకు ఈ "నాగరాజ వంశ" మూలపురుషులైన వృత్రాసురాది నాగప్రముఖులకును జరిగిన యుద్ధములు తిలకించిన ఈ కుల ప్రాచీన వైభవము వెల్లడియగును. వేదకాలమునకు పూర్వమే (అనగా, పది వేలేండ్లకు) వీరిప్రభ ఋగ్వేదాది గ్రంథముల యందును, రామాయణ, భారతాదుల యందును (కృత, త్రేత, ద్వాపర) ప్రతిధ్వనింప జేయుచునే యున్నవి. దేవాసుర యుద్ధములు జరుగక పూర్వమే ఈ "నగరాల" మూల పురుషులు బాహుబల తేజోవంతులై మేరువును కేంద్రీకరించి ఈ

పర్వతము చుట్టునూగల ఇలావృతమును "ఇలాపాత్రుడు" అను సహస్ర నాగములలో ఒకరగువారు పాలించు చున్నటులఁ దెలియుచున్నది.

శ్రీమద్భాగవతమున వర్ణింపఁబడిన దేవ, దానవ సంగ్రామమును చరిత్రదృష్టితో విలోకించిన దానవులను జయించుటకై దేవతలు "వాసుకి" యను నాగ ప్రముఖుని అర్థించి నాగసేనలను మందరగిరి చుట్టును ముట్టడింపజేసి విజయమందినట్లు దెలియుచున్నది.

సీతాదేవి తనయొక్క నిర్దోషిత్వమును వెల్లడించుకొనుటకై భూదేవిని ప్రార్థించుటయు, అంత మహాద్భుత జ్యోతితో నాగసింహాసనముపైనున్న భూదేవి వచ్చుటయు జరిగెను. (ఉ॥ రా॥ ము, 97 స, 14, శ్లో. రఘువంశం 15, స, 83—84, శ్లోకములలోకూడ ఈ భావమే స్ఫురించుచున్నది.)

అసురప్రోక్తములగు సూక్తములు, సర్ప ప్రోక్తములు, ఋగ్వేద దశమమండలమునఁ గలవు.

అసలీ "నగరాల" మూల పురుషులైన నాగరాజులు, పాతాళవాసులైన దేవసంబంధులుగా పురాణముల వర్ణనలవలన తెలియుచున్నది. భాగవతమున ఉదంకోపాఖ్యానము వలనను సువర్ణోపాఖ్యానము వలనను మన ప్రశంశ విశేషముగాగలదు. భాగవత దశమస్కంధమున శ్రీకృష్ణుఁడు కాళీయుఁడను నాగ

రాజును జయించి అతని కుమార్తెలను చెరబట్టినట్లు తెలియు చున్నది.

సీతాన్వేషణమునకై హనుమంతుడు నాగరాజ్యమైన "భోగవతీపురము" మీదుగా నిర్గమించినట్లు రామాయణ గాథవలనఁ దెలియుచున్నది.

(శ్రీ)రాముని కుమారుఁడగు కుశుఁడు కుముద్వతియను నాగరాజతనయను వివాహమాడి తన రాణిగాఁ జేసికొని నటుల రఘువంశము 17. వ సర్గయందుఁ గలదు.

హర్షచక్రవర్తి ఏడవ శతాబ్దిని రచించిన నాగానందము వలన మన పూర్వ చరిత్ర చాలా భాగము వెల్లడియగు చున్నది.

గుణాఢ్యుఁడను విద్వాంసునిచే రచింపఁబడిన "బృహత్కథ" అవలోకించిన ఆంధ్ర చక్రవర్తియగు శాతవాహనునకు ఈ విద్వాంసుడు మిత్రుఁడై కొంత కాలమునకు యతని మంత్రియై ఏడు లక్షల శ్లోకములతో ఏడు భాగములుగా పైశాచీ భాషయందు ఈ బృహత్కథ వ్రాయఁబడెనట.

ఈ గుణాఢ్యుఁడను విద్వాంసుడు ఆంధ్రరాష్ట్ర ప్రాంత ములోని "సుప్రతిష్టత" యను నొక బ్రాహ్మణ యువతికి ఒక నాగరాజువలన జనించినవాడని తెలియుచున్నది.

ఇంకనూ భారతము ప్రారంభములోనే ఆదిపర్వ ఉపోద్ఘాతానంతరము నాగోత్పత్తిని గూర్చి సహస్ర నాగముల కథ గలదు.

భీముని బాల్యమున దుర్యోధనుఁడు నీట ద్రోయించుట, అప్పుడు వాసుకి యను నాగరాజు ఆనతి చొప్పున నాగరాజులు ఎనిమిది కలశముల రసమును భీమున కొసంగి మహాబల సంపన్నునిగా చేసి రక్షించినటుల ఆదిపర్వం 128వ, అధ్యాయమునఁ గలదు.

అర్జునుఁడు "ఉలూపి" యను నాగకన్యను వివాహమాడి "ఇలావంతుడ"ను కుమారుని గనెను. "ఆది పర్వము 214 అధ్యాయము, భీష్మపర్వము 91, అధ్యాయమునఁగలదు.

ఖాండవ వనమును దహించి అనేకమంది నాగప్రముఖులను పాండవులు పరిమార్చి ఇంద్రప్రస్థపురమునుఁ గట్టుకొనిరి.

ఈ ఖాండవ వనమునఁగల నాగరాజులకు రాజైన "తక్షకుడు" సకుటుంబముతో కాపురముండు తావు యిదియే.

తక్షకుని కుమారుడైన "అశ్వసేనుడు" అర్జునునితో యుద్ధము చేయుచున్న కర్ణునకు సహాయ మేగుదెంచి నాగాస్త్ర సంధాన విధానమును అతనికి దెల్పి హతుఁడయ్యెను. (ఆది పర్వం, 277, అధ్యాయమునఁ గలదు.)

అభిమన్యుని కుమారుఁడైన పరీక్షిత్తుమహారాజును తక్షకుఁడను నాగరాజు పరిమార్చి పరీక్షిత్తు గృహమును సైతముఁ దహనముఁ జేసెను. (ఆదిపర్వం, 43,అధ్యాయమునఁ గలదు.)

ఉదంకుఁడుఅను ఆర్యముని ప్రార్థనల నాలకించి జనమేజయుడు సర్పయాగమునం దనేకమంది నాగ ప్రముఖులను బలవంతముగ నగ్నిగుండమునఁ ద్రోయించి పరిమార్పించెను.

అ స్తీకుడనువాని ప్రార్థన లాలించి చావగ మిగిలిన నాగ రాజులకు ఆర్యమతమును గట్టబెట్టిరి.

జనమేజయుడు ''తక్షశిలా నగరమును'' జయించినట్లు ఆదిపర్వం, 3, అధ్యాయమున గలదు.

జనమేజయుడు తక్షశిలా నగరములోనే భారత పురాణ మును విని సర్పయాగ వినోదమును పరిసమాప్తిఁ గావించుకొని హస్తినాపురమునకుఁ తిరిగి వచ్చినట్లు స్వర్గారోహణ, 5, అధ్యాయమున గలదు.

తక్షకుడను నాగరాజు నిర్మించి పాలితమైన రాజ్యమే "తక్షశిలానగరము." ఈ నగరమందుగల విశ్వవిద్యాలయమే వైద్య, శిల్పాద్యనేక లలితకళా కేంద్రము అని చరిత్రలు చాటుచున్నయవి.

దుర్యోధనసార్వభౌముని భంగపరచిన "మయసభ"ను నిర్మించినది మన జాతీయుడైన "మయుడే."

ప్రతి బౌద్ధమత స్థూపమునందును మనజాతిని దెల్పు శిల్పకళావైభవమును ప్రదర్శించియున్నారు. మణిపురము, నాగ పట్టణము, నాగులూరు, నాగాయపాడు, మొదలుగాగల అనేక నగరములు మన నాగజాతి పేరుతో పిలువందినవిఁ గలవు.

నాగావళి, నాగేరు, నాగచెరువు, మొదలుగాగల నదీ, తటాకములు; నాగరము, నాగవంకె, నాగులు, మొదలగు భూషణములు; నాగరాజ, నాగోజీ, నాగేశ్వర, నాగన్న,

నాగమ్మ, నాగమణి, మొదలగు నామములు; నాగబెత్తము, నాగమకుటము, నాగసింహాసనము, నాగధ్వజము, మొదలగు రాజలాంఛన పరికరములను బట్టియు, నాగవాసము మొదలగు వడ్రంగి పనిముట్లు, నాగదేవత లాదిగాగల ఈ పైవిషయము లును బహుప్రాచీనముగ ఆచరణ యోగ్యములై యున్నవి. ఇంతియేగాక ముల్లోకములలో నొకటగు "నాగలోకము" పురాణ ప్రసిద్ధి కెక్కినది కలదు. మనజాతీయ చిహ్నమే ఈశ్వ రునకు మకుటముగాను, మహావిష్ణువునకు శయ్యగాను, భూదేవికి సింహాసనముగాను, మనకు దైవముగాను, ఉన్న మన అనుశ్రుత చరిత్ర, ఆర్య, అనార్య, నాగప్రముఖులు సర్వకాల సర్వావస్థల యందు స్పృహా, స్మరణ, శ్రవణ, పఠనీయంబులని తలంతురు గాక. ఆర్య మతావలంబకులైన నాటినుండియే స్వమతమైన నాగమతమునకు దూరస్థులై షణ్మతములందుఁజేరి నాగరికులలో నాగరికులై కుల-గోత్రములు ఆర్యులమాదిరిఁ జెప్పుకో దొడం గిరి. అందులో ఆది కులమైన "నాగకులము" గోత్రముగను ఉనికియైన నగరమును కులముగాను, స్థిరపరచుకొనిరి. అనగా నాగరాజవంశము, నాగేశ, నాగేశ్వర, నాగేంద్ర, నాగమియ, సర్వేశ్వర మొదలుగాగల నాగగోత్రములుగను తక్షశిలా నగర వాసులైన తాము నగర కులముగాను చెప్పుకొనుచు దిన దిన ప్రవర్ధమానులై వర్ధిల్లుచున్నారు. వీరి క్షత్రత్వాద్య నేక సరస గుణములచే నేటివరకు ప్రత్యక్షముగ వీరియెడ రాజ లాంఛనములు కానవచ్చుచున్నను సహజ ద్వేష రోషావేశు లైన ప్రతిపక్షులు శూద్రులుగ వీరిని పిలువజొచ్చిరేకాని, నగ

రాల జాతిమాత్రము వారన్న తెగకు పోలరు. మన పూర్వ వంశ పవిత్ర చరిత్ర గౌరవ భాగ్య యోగ్యత లెఱిఁగినవారు మనలను తెలుసుకొనఁగలరు.

ఏ కుల చరిత్ర నిర్దుష్టముగ ప్రకాశింపఁజేయవలెనన్నను పూర్వ మా దేశమునందుగల మతములను సవిమర్శనముగా తరచి, అందీ కులము, ఏ మరుగునఁ దాగినదో తరచినఁగాని ఆ ప్రజా భావాతిశయములు వెల్లడి కావు. మానవ జీవితా భ్యుదయ మంతయు ఆదినుండి నవయుగ పర్యంతము ఈ "నగ రాల" కుల చరిత్రయం దిమిడిన కిరణములు తర తర, వివేక, విచక్షు, జ్ఞానోదయ భాను ప్రకాశ మంతయుఁ నొక్కచో క్రోడీకరించిన నా నేర్పు, కూర్పు, విమర్శనా సాదృశముగ ఈ మూల గ్రంథమును చవిజూచిన చదువరులకు కృతజ్ఞుడను.

విశాల, వినిర్మల సద్బుద్ధితో మూలగ్రంథమును విలో కించిన విద్వాంసుల కిది సులభసాధ్యముగ రచించిన గ్రంథము మాత్రము కాదని ఎరుంగకపోరు. సంకుచిత భావకులకు సైతము విశాలమార్గమునుఁ జూపక మానదు. ఇందనేక శాస్త్ర, శాసన పరిశోధకుల సారాంశములు చేరియుండుటచే సమస్త ప్రజానీక మునకు జాతీయ గ్రంథమై వర్ధిల్లగలదను దృఢ విశ్వాసమే నన్నీ గ్రంథరచనకు పురికొల్పినది.

అంతియేకాని నా జాతి యొక్కయు, నా రచన యొక్కయు, నా ఉన్నత భావావేశ పర్వత పరంపరల ఘన

తను ప్రకటింప నుద్దేశించి ఈ గ్రంథమును వ్రాయలేదని చదు వరులకు మరల మరల మనవి చేయుచున్నాను.

ప్రతి జాతియందును, సంఘమునందును, మతమునందు నుగల ఒక వ్యక్తిని విడిగా విడదీసి; అతని దోషములను ఎన్ని; ఆ వ్యక్తిగత దోషములు సంఘమున కంతకుఁ గట్టబెట్టి కళంక మాపాదింపఁజేయుటకన్న ఆయా సంఘములయొక్క ఆది చరిత్రను పైకి దీసి పరిశోధించినయెడల సంఘ సమూహాము నందు అనురక్తిఁగలిగి వ్యక్తిగత దోషములుఁ దొలగిపోవును.

అనన్య తేజో వికాసమై ప్రకాశించు ఒక జాతీయ రత్నము విడిగా పరీక్షించి దాని దోషము లెన్నుటకన్నను మాలిన్య రహితమైన పదియారు వన్నె బంగారమునఁ బొదిగి వస్తురూపమున శిల్పిచే తీర్చి దిద్దినప్పుడే చూడనొప్పును.

క్రీస్తుశకము 1245 వ సంవత్సర ప్రాంతమున (శ్రీ) మన్మహామండలేశ్వర నాగదేవ మహారాజు విక్రమసింహ పురమును పరిపాలన చేయుచున్నటుల "ఆత్మకూరు సమీపము లోని కామిరెడ్డిపాడులో వెలసియున్న దుర్గాపరమేశ్వరి కైంక ర్యమునకై అనయూరు ప్రభువులగు తమ్మారెడ్డి చేసిన దానశాసనముబట్టి తెలియుచున్నది.

ఈ నాగదేవుడు నాగరాజ వంశోద్భవుడుగా తెలియు చున్నది. ఆంధ్ర చక్రవర్తినియగు రుద్రమదేవి కాలమునుండి నెల్లూరి మండలములోని కొంత భాగమునకు పరిపాలకుడుగ నియమింపబడెను.

చోళచక్రవర్తులకు, కాకతీయాంధ్ర చక్రవర్తులకు సామంతులుగా యుండిన నాగరాజ వంశస్థులు నెల్లూరు మండలమున అప్పుడప్పుడు పాలకులుగా యుండి యుండిరి. రాజరాజ చోళ చక్రవర్తియొక్క 16 వ పాలన సంవత్సరమున నాత్రేయ గోత్రీకుడును అహిక్షేత్ర పురాధీశ్వరుడును ఫణిమండలాధిపతి యును, శివపాదశేఖర బిరుదాంకితుడును, కులోత్తుంగ చోడ పట్టణ శేఖరదేవుని పుత్రుడు నగు సిద్ధరాజుయొక్క దానశాసనము గూడూరు సీమలోని "మల్లమను గ్రామంలోని సుబ్రహ్మణ్యేశ్వరుని ఆలయములో వ్రాయబడి యున్నది.

మూడవ కులోత్తుంగ చోడచక్రవర్తికి సామంతుగా యుండి ఆ ఆలయముననే వ్రాయించిన దానశాసనములలో తా నాత్రేయ గోత్రజుడనియు, ఫణిమండలాధీశ్వరుడననియు చెప్పుకొన్న పెద్దరాజుకూడ సిద్ధరాజు వంశములోనివాడే. ఈ పెద్దరాజుకొడుకు సిద్ధరాజు తన జ్యేష్ఠ సోదరియగు పచ్చలదేవి మనుమ సిద్ధిరాజుయొక్క భార్యయని గూడూరు సీమలోని రెడ్డిపాలెములో నున్న పాండురంగస్వామి ఆలయములో దాను వ్రాయించిన దానశాసనములో పేర్కొని యున్నాడు. ఈ సిద్ధిరాజు యొక్క భార్య వరయూరి చోడుండను శూరాళ్వారు, కత్తి దేవరాజు కుమార్తెయగు ఇమ్మడి శ్రీయాళదేవి యని అచ్చటనే మరియొక శాసనమును బట్టి తెలియుచున్నది.

ఈ శాసనములను బట్టి తెలుగు చోడరాజులకును తెలుగు నాగరాజులకును సంబంధ బాంధవ్యములు కలవని స్పష్టముగా తెలియుచున్నది.

(ఆం॥ చ॥ 2 భా-2 ప్ర, 104-105, 106 పే- చూడుడు.)

సంఘీయుల తోడ్పాటు కించెత్తుగూడా నేటిదనకు లభింపకుండుటయే జాతి మూలగ్రంథము వెనకబడినది. ఈ విధముగా మూలగ్రంథముయొక్క విషయసూచికను ముద్రింపించి ప్రకాశకులుగా సంఘీయులనుచేర్చు తలంపుతో ఈచిన్నిపొత్తము ప్రచురించబడినది.

నాగులనువారు ఉత్తరమధుర ప్రాంతమునందు ఆటవిక జాతి వారుగా నున్నారు. భరతఖండమందు ఈ జాతి శాఖోపశాఖలుగా మిశ్రజాతులయందు కాలవశమున కలసిపోయియున్నది. "అస్సాం" దేశమున నాగపర్వతమను నొక పర్వతము కలదు. తత్ప్రాంతమందు ఈ నాగజాతి అడవి జాతులలో విశాఖపట్టణ జిల్లాలో కానబడుచుండిరి, మనఆంధ్ర దేశములో విశాఖపట్టణపుజిల్లాలో నాగజాతి వేశ్యస్త్రీలుకలరు. (నాగవాసులు) నాగకన్యలు సంగీత పాటకురాండ్రని పెక్కు గ్రంథములయందు గలదు. ఆంధ్రదేశపు నాగకన్యకలును సంగీత పాటకురాండ్రే. వీరిలోను అంతశ్శాఖలు కలవు. 1. కూర్మలు 2. బోగాలు 3. సానులు 4. నాగవాసులు. ఆస్సాములోని నాగులు మాంస భక్షణాది దోషయుక్తులని ఈ నడుమ వార్తా

పత్రికల వలన తెలియుచున్నది. అమరావతి మొదలుగాగల స్థూపములలోగల నాగుల ప్రతిమలు మనుష్యాకార సర్పము లుగా చిత్రింపబడియున్నవి. అమరుని నామలింగానుశాసనము భోగివర్గములో నాగులలో మనుష్యత్వమును గూర్చి వర్ణించుట గమనింపవలసియున్నది.

భీముని రక్షించునప్పుడు వాసుకి ఆర్యకుడను నాగరాజు నకు దౌహిత్ర దౌహిత్రుడని చెప్పుటచేతను, భారతవ్యాఖ్యాత కుంతీభోజునిద్వారా ఈ సంబంధము కలిగియుండుటచే కుంతిని పెంచిన కుంతీభోజుడు నాగుల దౌహిత్రుడని స్పష్టమగుచున్నది. ప్రాచీన నాగరిక విగ్రహముల శిరస్సులపైనున్న సర్ప చిహ్న ములు ఆనాడు ధరించు శిరోవేష్టనం రూపములనియు, అడుగున నుండి సర్పచిహ్నములు పాశ్చాత్యజాతి స్త్రీలు లుంగీలవంటి వనియు కొందరు చరిత్రకారులు నుడువుచున్నారు.

దీనినిబట్టి చూడగా, హిందూమతమందు శాఖోప శాఖలుగా, వివిధజాతులవా రెట్లుండిరో, ఆలాగుననే ఈ నాగ మతమునందును, నాగ బ్రాహ్మణులు, కళింగకోమట్లు, నాగ రాజులయిన మనవారున్నూ, తదితర జాతులవారుకూడ లెక్కకు మెన్నయయిన వారీ నాగమతమందుండి యున్నారు.

నాగులల్లో గల అంతశ్శాఖలు,

పాము, అసుర, భూమిజ, బింజియా, బిక్‌హోర్‌, చమూర్‌, ఛిక్‌ఛోం, గోయిల కోదు (గొందు), ఖరియా

ఖర్వాయు, కోష్టికూర్మి, లోహార్, మాల, ముండా, నాగేశ పాన్ పరహియాయా, పాహోర్ కాటియా, కిస్కూ-సంతాలు, వీరు నాగులనబడువారు.

—: నాగ్ :—

తెలుగు జాతుల్లో "నాగ్" అను ప్రత్యేక నామముతో ఒప్పుచున్న భిన్నమైన తెగలు చిక్ జాతిలోని బోరా తెగ ఘాసీ జాతిలోని ధమ్మా, సర్పా, సన్యాసి, అను తెగల వారు.

కొరవాలోని సంపా తెగ, ఓఢ్ర కుమ్మర్లలోని, సర్ప శాఖ, లాహోర్ జాతిలోని పస్రూ తెగ, ముండా జాతిలోని చిట్టి, గరబింగు, కావన్ రియా, నది సంప తెగలు.

ఒరాయన్ జాతిలోని ఖేట్టా తెగ, పాన్ జాతిలోని దోద్ తెగ, స్త్రీల లోని నాగబుషి తెగ, తూరీ జాతిలోని సంపా తెగ.

కులములు తెలుసు కొనుట యెట్లు?

సంఘమును గూర్చిగాని, జాతినిగూర్చిగాని, చరిత్ర నిర్మాణమునకు పూనుకొనుట సామాన్య విషయముగాదు. అందు సమగ్ర చరిత్ర మరుగువడిన యొక ప్రాచీన నాగరికత గల సంఘ చరిత్ర వ్రాయబూనుట విశేష శ్రమసాధ్యము. ఇట్టి రచనకు అనేకములైన సాధనములు అవసరములు.

వేద, వేదాంత, పురాణ, ఇతిహాసములు మథించి విషయ సమన్వయముఁగావించుట ప్రాచీన, వర్తమాన, ఆచార, వ్యవహార, విమర్శనము, ఆయా సాంఘిక ఉపాస్య దేవతలు, ప్రమాణగ్రంథములు పారంపర్యముగ చెప్పుకొనెడి వంశగాథలు, వృత్తులు, అభ్యాసాధికములు, గోత్రములు, మతములు, గృహనామములు, బిరుదములు, ఈ విషయములు వంశచరిత్రకు చాలాభాగము రచనకు తోడ్పడగలవు. ఇంత మాత్రముననే కృతకృత్యులమైతిమని భావించుట సాహసము.

శాసనములు, ప్రాచీనజాతి నిర్ణయమునకు ప్రబలాధారములు. ఇంతియేకాదు, భూగర్భ పరిశీలనము అందుఁగల ప్రాచీన నిదర్శనములు, అత్యంతోపయోగకరములుగా నుండును. ఇన్ని సమకూర్చుకొని సమన్వయముఁజేయగల్గినఁగాని చరిత్ర నిర్మాత గమ్యస్థానమునకు చేరజాలడు.

ఏకులముయొక్క మూలమును తెలుసుకొనవలయునన్నను ముందువారు, ఆయా కులములవారు యేయే మతములయందు లీనమైయుండిరో వారు ధరించిన గోత్రములు గ్రహించినగాని వంశమెరుగరాదు. అట్టి వంశమును ఇతిహాసక దృక్పథముతో విమర్శించిన నిర్ణయమునఁగాని వారి పూర్వనివాస స్థానములు యెరుగరావు.

పూర్వుల నివాసయోగ్యములైన నిలయములందు వారి వారి యోగ్యతల కనువగు బిరుదులను చర్చించినఁగాని గృహనామములు బయలుపడవు. ఆయా గృహనామములు ధరించిన

పురుషసింహుల చరిత్రలు విలోకించిననగాని క్షేత్రత్వ, మహాత్వ పటుత్వము వెల్లడికాదు, క్షేత్రత్వమునం దనుశ్రుతముగనున్న సాంప్రదాయము తిలకించిననగాని కులగౌరవ సిద్ధాంతము తేట తెల్లముకాదు. ఈ విషయములు రుజువుచేసుకొన్ననగాని కుల వృక్షముయొక్క మహాఫలము సేకరించలేము.

ఆర్య, అనార్య, ద్రావిడ జాతులలో ఏ తెగకు చెందిన వారు, నాగరాజ వంశజులైన నగరాలు? అనువిషయమే గమనీయాంశము. అనార్యులనియు, ద్రావిడులనియు, కిరాతు లనియు, దస్యులనియు ఎవరిని పిల్చుచున్నారో వారి పూర్వులే నాగరాజులు. ఈ నాగరాజ వంశజులే నేటి నగరాలు. వీరి ఆచార, వ్యవహార, ఆరాధన, అర్చనాదుల వలనను అను శృత బహుబలపౌరుషాదుల వలనను వంశపారంపర్యముగా చెప్పుకొనెడి వంశగాధల వలనను, వీరు ధరించిన పవిత్రగోత్ర ములైన నాగేశ్వర, నాగేంద్ర, నాగమయ, నాగేశ మొదలైన గోత్రములవలనను నాగచిహ్నములు గల యాభరణముల పవిత్రాభరణములుగ ధరించుటచేతను నాగరాజ జాతియేయని చెప్పకయే చెప్పుచున్నది. మూలపురుషులను చిరస్మరణీయ మొనర్చుటకై ధరించినవే గోత్రము లనబడును.

ఒక ప్రాచీనసంఘచరిత్ర మతములో లీనమైయున్నప్పుడు దానిని విడదీసి అధునాతన సాంప్రదాయములను సమన్వయము జేసి ప్రదర్శించుటలోగల శ్రమ మణికట్లు తిరిగిన పెద్దల కగును గాని సామాన్యుల కిది సామాన్యమె!

---

# అనుశ్రుత గాథ

చరిత్ర నిర్మాణానికి అనుశ్రుతంగా చెప్పుకొనే గాథలు కూడా కొంతవరకు ఉపకరిస్తాయని తెలియజేస్తున్నా, అట్టి అనుశ్రుతమైన గాథనే యిక్కడ పొందుపరుస్తున్నాను.

ఉత్తరహిందూస్తానంలో పూర్వం తక్షశిలానగరమనే పట్టణం వుండేది. ఆ పట్టణాన్ని నాగరాజులు పరిపాలించేవారు. ఆ నగర చక్రవర్తికి అసమాన తేజోవంతుడై బాహుబల పరాక్రమ సంపన్నుడైన ఒక్క కుమారు డున్నాడు. ఆ చిన్నవాని చిన్న వయసునందే తండ్రి గతించాడు. ఆ రాజ్యానికి మంత్రిగా వున్నవాడు ఆర్యమతస్థుడు నలుగురు కుమారుల్ని కలిగి వున్నాడు. అందులో పెద్దవానికి తక్షశిలా రాజ్యాన్ని కట్టబెట్ట వలెనన్న దురుద్దేశంతో బాలకుడుగా వున్న నాగరాజ వంశీయుని చంపించడానికి అనేక ఉపాయాలతో సమయంకోసం నిరీక్షిస్తున్నాడు.

కొంతకాలానికి ఆ మహామంత్రి దుష్ట తలంపును గుర్తించిన నాగరాజ కుటుంబీకులు గుమిగూడి యోచించారు. రాజ్య పరిపాలన మంత్రి హస్తగతమై వుండుటవల్ల రాజకుమారునికి అపాయం కలుగుతుందని కూడబలుక్కొని రహస్యంగా పలాయనం కావటానికి నిశ్చయించుకొని, ఒకనాటి అర్ధరాత్రి సమయంలో రాజకుమారుణ్ణి వెంటబెట్టుకొని దక్షిణదిశోన్ముఖులై ప్రయాణం సాగించి మైసూరు నగర్నాన్ని చేరుకొన్నారు.

మఱునాఁడు తక్షశిలానగరంలో యెక్కడా రాజకుమారుడు రాజబంధుగులు కన్పించకపోవటంతో ఆ నగర వాస్తవ్యులంతగానో విచారించారు. మంత్రిమాత్రం పైకి విచారాన్ని ప్రదర్శిస్తున్నా రహస్యంగా యే తదన్వేషణ ప్రయత్నా నిమగ్ను డయ్యేయున్నాడు. ఎందరెందరినో గూఢచారుల్ని దేశ దేశాలకు పంపించి వెదకిస్తున్నాడు. రాజ కుమారుని భోగట్టా తెలియజేసినవారికి విరివిగా బహుమానా లొసంగబడతాయని అన్ని చోట్లా చాటింపచేయించాడు. తన ఆంతరంగిక మిత్రులతో మాత్రం భావి కర్తవ్య సమాలోచన జరుపుచునేయున్నాడు.

కొన్ని రోజులకు ఆ రాజ బంధుగులు రాజకుమారునితో కూడా మైసూరు నగరంలో సురక్షితంగా వున్నట్లు గూఢచారులవల్ల తెలుసుకొని, యేవిధంగానైనా రాజకుమారుణ్ని బంధించవలెనన్న వుద్దేశంతో మైసూరు సంస్థాన ప్రభువులతో స్నేహం చేసి అనేక కానుకలు పంపించాడు. అప్రమత్తులైవున్న రాజబంధుగులు ఆ రహస్యాన్ని తెల్సుకొని ముందుగానే రాజకుమారుణ్ని తీసుకొని రహస్యంగా చెన్ననగరాన్ని చేరుకొన్నారు.

చెన్ననగరంలోగల నావికులతో సంప్రతించి, తాము కాందిశీకులమని మాన మర్యాదలు కాపాడుకోటానికి తగ్గ బాహుబల వీర పరాక్రమ పౌరుషాదులతో చెలువొందే దేశమేదయినా వారి యెఱుకలో వున్నట్లయితే తమ్మాదేశానికి

చేస్తే ఉపకారాన్ని చేయవలసిందని రాజబంధువులు కోరారు. అప్పుడా నావికులు కళింగదేశం అన్నివిధాలా అనుకూలమైన ప్రదేశమని చెప్పి, వారిని కొద్ది రోజుల్లో నౌకాయానం ద్వారా 'పూడిమడక' రేవును చేర్చారు.

ఈ పూడిమడక రేవు అనకాపల్లికి దక్షిణంగా పన్నెండు మైళ్ల దూరంలో వుంది. అక్కడ సేనానులు మాత్రం కొందరు దిగి చీపురుపల్లె మీదుగా పర్యటనచేసి 'చిన్న పల్లె'ను నిర్మాణం చేసుకొన్నారు. వారు 'పాత్ర' బిరుదాంకితులు కావటంవల్ల ఆ పల్లెకు చుట్టుపట్లగల ప్రజలంతా "పాత్రులట— యే నగరం నుంచో యిక్కడకు వచ్చి పల్లెను నిర్మించుకొన్నారట—" అని చెప్పుకోవటంతో ఆ పల్లెకు 'దేశపాత్రునిపాళెం' అనే నామం స్థిరమైంది. ఆ పేరుతోనే యిప్పటికీ గూడా పిలువబడుతోంది. ఆ పల్లెలో పాత్రులు మాత్రమే నివాసాలేర్పరచుకొని చుట్టు ప్రక్కల భూముల్ని స్వాధీనంచేసుకొని క్షత్రియ ధర్మాన్ని విడనాడకుండా వ్యవసాయాది వృత్తులతో జీవిస్తూ ధర్మ వైద్యం చేసేవారు. కొన్నాళ్ళకి ఆ గ్రామ జనాభా నాలుగు వందల వరకు పెరిగి క్రోసు వైశాల్యంతో నూరు గృహాలు కలిగివుండి.

—: పాళెం :—

"పాళెమన రక్షణము, స్వల్ప పట్టణంబు
జెల్లె సైన్య ప్రదేశమా సేనపేరు."

పాళెము:— అనగా రక్షణము, స్వల్పము, సైన్యప్రదేశము, సేన
(ఆం.ప.ని. పేజి 454—నానార్థవర్గు. 547 వ పద్యం.)

—: నరేంద్రపురం :—

పూడిమడక రేవులో దిగగా మిగిలినవారు మరికొంత మంచి రాజకుమారుని పేరుతో ఒక పట్టణాన్ని నిర్మించాలని తలచారు. కాని అట్లా చేసినట్లయితే తమ రహస్య చరిత్ర వెల్లడి కాబడి తిరిగి యే కష్ట నిష్ఠురాలకు లోనుగావలసి వస్తుందో యని క్షత్రియ హోదాను సూచించే 'నరేంద్రపురం' అనే నగరాన్ని నిర్మించుకొన్నారు.

లోగడ తెల్పిన పాళెములలో పదింటికి ముఖ్యస్థానమైన దానికి 'పురం' అని అంటారు. అందు 500 గృహాలు, 1,600 మంది జనసంఖ్య కలగి వుంటై. ఆ విధంగానే 2,500 గృహాలతో 100 గ్రామాలకు ముఖ్యస్థానమైనది 'పట్టణం' అని వ్యవహరించబడుతుంది. 1,000 గ్రామాలకు తలకట్టయినదాన్ని నగరమని 10,000 గ్రామాలకు ముఖ్యస్థానమైనదాన్ని 'పురి' యని అంటారు. 12,500 గృహాలతో 2,000 చ. మైళ్ల విస్తీర్ణంగల రాజ్యానికి 'నగర'మంటారు.

ఈ పూర్వకాల గ్రామ రచన ప్రకారం మన పూర్వ నివాస స్థలమైన తక్షశిలా నగరాన్ని నిర్ణయించుకొని చూస్తే 2,000 చ.మై. విస్తీర్ణం గలిగి, 1,000 గ్రామాలకు ముఖ్య నగరమై; 12,500 గృహాలు కలిగి, గృహానికి 4 గురు వంతున 50,000 జనాభాతో విలసిల్లి యున్నట్లు తెలుస్తున్నది. అట్టి మన తక్షశిలానగరం ఒకప్పుడు దేశదేశ దిగ్దిగంత విశ్రాంత

యశశ్చంద్రికలతో, పవిత్రధరిత్రీచరిత్రకు నవరత్నాభరణాంగిన్నై ప్రకాశించి యిప్పుడు శిథిలమై, నామరూపరహితమై యున్నది. తన్నగర భార నిర్వాహక చక్రవర్తులమైన మనం యే వంశ జులమో, మన బలపరాక్రమ వీరపౌరుషము లెటువంటివో తెలుసుకొనలేని యిట్టి పతన పరిస్థితికివచ్చాం. మన సనాతన కుల ధర్మాలు నశించి ఆర్య ధర్మావలంబనుల మగుటవల్ల మనల్ని మననే మరచిపోయి తారుమారౌతున్నాం.

## —: ఇరువాడ :—

మఱికొంత కాలానికి నరేంద్రపుర నగరాలు, దేశపాత్రుని పాలెపు నగరాలు, ఇరు గ్రామస్థులు కలసి 'ఇరువాడ' అనే పేరుతో చిన్న పల్లెను నిర్మించుకొన్నారు. అక్కడ స్థిర నివాసము లేర్పరచుకొన్న కొంతకాలానికి జనాభా పెరిగినందు వల్ల చాలామంది వాసయోగ్యములైన ప్రదేశాలకి వలసపోయి అనేకచోట్ల అనేకమంది స్థిర నివాసాలేర్పరచుకొని నగరులని, నగరాలనే పేర్లతో వ్యవహరింప బడుతున్నారు.

## —: విశాఖపట్టణం :—

లోగడ చెల్పిన రాజ బంధుగుల్లో కొంతమంది విశాఖ పట్టణం రేవులో దిగి అక్కడ నివాసా లేర్పరచుకొన్నారు. వారిలో చౌదరి, సుఖవాసి, సంపదరావు, మాకెన, పిళ్ల, రాయని వార్లు ముఖ్యులు. చౌదరి అనగా "ఒక పరిగణాకైనా,

గ్రామానికైనా పెత్తందారి" అని అర్థం (నానార్థ రత్నమాల).

—: విశాఖపట్టణ ప్రాచీనత :—

ఈ నగరం యొక్క ప్రాచీన శాసనాల్నిబట్టి చూస్తే అనంతవర్మ కాలంనాటికే అనగా క్రీ. శ. 1070–1019 మధ్య కాలంలో కుళోత్తుంగ చోళ చక్రవర్తి యీ నగరంలో విశాఖేశ్వరుణ్ణి ప్రతిష్ట చేసి దేవాలయాన్ని కట్టించినట్లును, ఆ దేవాలయం సింహాచలానికి నాల్గు క్రోసుల దూరంలోగల విశాఖపట్టణ సముద్రతీరంలో వుండేదని తెలుస్తున్నది.

పూర్వం యీ విశాఖపట్టణం కుళోత్తుంగ-చోళపట్టణం అని వ్యవహరింపబడేది. ఇది పెద్ద వర్తక స్థలమనికూడా తెలుస్తోంది. ఆనాటి విశాఖేశ్వరాలయం క్రీ. శ. 1750. సం వరకు ముఖమండప గోపుర ప్రాకారాలు కనిపిస్తుండేవని, క్రమేణా గోపురంతో సహితంగా సముద్ర గర్భంలో మునిగిపోయినట్లు తెలుస్తున్నది.

ఓర్మి (ORM చిత్రకారుడిచ్చిన క్రీ. శ. 1758 నాటి విశాఖపట్టణ పటాన్ని (MAP) జాగ్రత్తగా పరిశీలించి చూచినట్లయితే ఆ విశాఖేశ్వరాలయానికి, సముద్రానికి ఆ కాలంలో సుమారు ఒక మైలు దూరమున్నట్లు కనబడుతుంది.

ఈ రేవులో దిగినవారు విశాఖపట్టణం కోటలోవున్న కొండను దుర్గంగా చేసుకొని స్థిర నివాసా లేర్పరచుకొన్నారు.

వీరి కులదేవత 'దుర్గ'. ఈదుర్గాదేవిని ప్రశాంతంగా ఆరాధించుకోవటంకోసం ఆ కొండమీాదనే ఆలయ ప్రాకారాలు నిర్మించి, పూజించుకొనేవారు. కొన్ని శతాబ్దాలు గడచినతర్వాత మన భారతదేశ మంతా మహమ్మదీయుల పరిపాలనలోవున్న రోజుల్లో కాశింకోట సంస్థానాధీశులైన నవాబులు యీా విశాఖపట్టణ దుర్గాన్ని దుర్గతోసహా ఆక్రమించుకొన్నారు. ఆ దుర్గయే నేడు దర్గా అను పేరుతో వ్యవహరింపబడుతోంది.

ఈ 'నగరాలు' తక్షశిలానగరంనుండి తెచ్చుకొన్న కొమ్ములు గల కొబ్బరి బొండాలు యీా నాటికి కూడా వున్నై. కాని వాటిని మహమ్మదీయులే తెచ్చియున్నట్లు గొప్పగా చెప్పుకుంటున్నారు. ఈ దుర్గామహాదేవిని మహమ్మదీయులు దర్గా యని ఉచ్చారణ దోషంవల్ల పిలవటంచేత దర్గా యనే నామం వ్యవహారికమైంది గాని, 'దుర్గ' అనే నామమే నిజమైనది, సరియైనది. ఈ దుర్గాన్ని కాశింకోట నవాబులు అనేక వ్యయ ప్రయాసలతో తమ యావచ్ఛక్తి వినియోగించి వశపరచుకొన్నారు.

ఆ సంఘర్షణలో మన నగర వంశస్థులు తమ అఖండ విశ్వ విఖ్యాత బాహు బల పరాక్రమ వీర పౌరుష చాకచక్యాలతో యుద్ధంచేసి శత్రు పక్షాలవారైన మహమ్మదీయులకు విశేష భయ సంభ్రమాలు కలిగించారు. కాశింకోట సంస్థానాధీశ్వరుడు మనవారి ధైర్య సాహసాలకు అచ్చెరువంది, సంతో

మంత్రో నరేంద్రపురాన్నే నగరాలకు నజరానాగా యిచ్చారు. కొంత కాలానికి నరేంద్రపురాన్ని, విజయనగర ప్రభువులైన గజపతు లాక్రమించుకొని, పెదగాడి అనే గ్రామాన్ని తాణాతో సహా తమ సామంతులకు పప్పజెప్పి వారికి "బల్లెం పట్టుదార్" అనే బిరుదు లిచ్చారు. గజపతులు వారిని తమ స్నేహకోటిలో జేర్చుకొని ఉచిత రాజ మర్యాదలతో ఆదరించేవారు. అప్పటి నుండి సంస్థానాధీశుల అభిమానాశ్రయాలు లభించినై.

ఈ విశాఖపట్టణ రేవులో దిగినవారిలో చాలామంది చుట్లుపట్ల ప్రదేశాలకు చెదరి వెళ్ళి వలసరాజ్యా లేర్పరచు కొన్నారు. అక్క డక్కడ వారి వారి పేర్లతో గౌరవంకోసం కొన్ని పల్లెల్ని నిర్మించుకొని, ఆ గ్రామాలకు నాయకులై నాయుడు, నాయులు అనే బిరుదులతో వ్యవహారింపబడుతూ వ్యవసాయాది వృత్తులతో సుఖ జీవనా లేర్పరచుకొన్నారు.

—: క్షత్రియ లాంచనముగల హోదాలు :—

ఈ దేశానికి వచ్చిన కొంతకాలానికి మన నగర ప్రముఖులు విల్లు, పిడిచాకు మొదలయిన క్షత్రియలాంఛనమైన ఆయుధాల్ని పరిత్యజించారు. అందుకు కారణం తక్షశిలానగర మంత్రివల్లనే వీరి కుల శీల ప్రతిష్టలు భంగకరములైనవని తోస్తున్నది. కాకపోయినట్లయితే జనమేజయ సర్పయాగ ఫలితమే దీనికి కారణమై యుంటుంది.

వీరికి వైద్యశాస్త్రంలోను, శిల్పశాస్త్రంలోను అసమాన ప్రతిభా ప్రభావాలు వున్నట్లు తక్షశిలానగర విశ్వవిద్యాలయంలో వైద్యవిద్యాచార్యులుగానుండి ప్రసిద్ధికెక్కిన 'మాకెన' వారు కనబడుతున్నారు. తక్షశిలానగర విశ్వ విద్యాలయంలో ఉపదేశకులుగాను, ఆచార్యులుగాను, శీలభద్రులుగాను, పాత్ర-మహాపాత్ర బిరుదులు గలవారు వుండేవారు.

వీరు అఖండ బలపరాక్రమ పౌరుషాలతో, వైద్యవిద్యాసాగరులై, విశ్వవిఖ్యాత శిల్పకళా పరమేశ్వరులై, మహా రాజ సంతో, గౌరవ ప్రతిపత్తులతో కళింగ నగరాధీశ్వరులైన కపిలేశ్వర గజపతి నాటికే రాజులుగాను, నగరాధ్యక్షులుగాను, సామంత ప్రభువులుగాను, దండనాధికారులుగాను, భిషక్కులుగాను, పరీక్షన్మహాపాత్రులుగాను, దుర్గాధ్యక్షులుగాను, ఇంకా అనేకమైన క్షత్రియోచిత పదవులలో వుండి కృష్ణదేవరాయ విజయంనాటివరకు అరిలోకభీకర మహాతీవ్ర ప్రతాప కిశోరులై పోరిన వీరాధివీరులే మన నగరాలని విశదమౌతున్నది. (అనగా 1414 నాటికే)

ఈ సుక్షత్రియ వంశస్థుల్ని గూర్చి మహా కవికుమార ధూర్జటి 'కృష్ణరాయవిజయం'లో బహు రమ్యంగా వర్ణించియున్నాడు. వీరి బాహుబల వీర పరాక్రమ పౌరుషాల్ని బహు చరిత్రలందేగాక శాసనాల్లో సహితం వ్రాయబడి వున్నై. అంతేగాక నేటికిని ప్రత్యక్ష్యంగా కనిపించుచునే వున్నై.

వీరి జన్మస్థానం తక్షశిలానగరమైనా, వీరి వంశం నాగ వంశమైనా, పూర్వ చరిత్రను యేమాత్రం బయటకు రానీయకుండా బహు గోప్యంగా కాపాడుకొన్నారు. వీరి కులాన్ని చెప్పుకొనేటప్పుడు నాగరాజుల మనే విషయాన్ని కప్పిబుచ్చి నగరవాసులమని, నగరాలమని చెప్పుకోటం మొదలుపెట్టారు. మఱికొంతమంది తక్షశిలానగరులమని, కళింగనగరులమని, మైసూరు నగరులమని చెప్పుకొనటంవల్ల రాను రాను దేశ నామం లోపించి నగర శబ్దం స్థిరమై నగరాలనే నామంతో వ్యవహరింప బడుతున్నారు.

ఈ విధంగా యెన్నో నామము లేర్పడినట్లు చరిత్రలందు నిదర్శనా లెన్నో వున్నై. ఎవరు ఏవిధంగా పిలిచినా వీరు మాత్రం మూలాన్ని మఱచిపోలేదు. వంశమూలాన్ని మఱచిపోకుండా గోత్రాలుగా మార్చుకొని నాగేశ్వర, నాగేంద్ర, నాగమియ్య,నాగ మొదలైన గోత్రాలద్వారా నాగ ప్రముఖులమని, తక్షశిలా నగరాన్ని మఱచిపోకుండా నగరాలమని చెప్పుకోవటంవల్లనే యీ నగర కుల చరిత్ర జీవస్రవంతిగా ప్రవహిస్తున్నది. ఇంకా యితర గోత్రాలు చాలా వున్నై. అవి వీరీ దేశానికి వచ్చిన తర్వాత అన్యమతావలంబకులై ఆయా మతాదర్శక వస్తువుల్ని పూజనీయమైన గోత్రములుగా ధరించారు.

ఇంకా కొన్ని యింటిపేర్లు ఆచార వ్యవహారాదుల వల్ల కలిగిన బిరుదులు, అనగా గురుమహంతు, సత్యాల, శీలము, సంపదరావు, సుఖవాసి, భోగాల, చక్రవర్తి, రాయని

మొదలగు బిరుదులు యింటిపేర్లుగా మారి, వారి వారి పూర్వ చరిత్రల్ని నిరూపిస్తూనే వున్నై.

తక్షశిలానగరంలో జనమేజయ సర్పయాగాది క్రూర కృత్యములవలన కల్గిన యిక్కట్లేగాక రాజకీయ విప్లవముల వల్లను బౌద్ధ, జైన, ఆర్య, వైష్ణవ, విశిష్టాద్వైతాది మత విజృంభణమువల్లను, యీ వంశమేగాక యెన్నియో క్షత్రియ వంశాలు వారి వారి సనాతన కుల ధర్మాలు విడచి విరుద్ధమైన ధర్మాల్ని అలవరచుకొని అధోగతిపాలైనై. ఈ విధంగా పతన స్థితినొంది వారి వారి వంశోచితమైన లాంఛనాల్ని పోనాడు కొన్న సంఘాలు యింకా యీ భారతదేశంలో ప్రచ్ఛన్నంగా వున్నై. అట్టివారి పూర్వ చరిత్రలన్నీ మరుగున పడి రూపు మాసిపోయినై. వైదికయుగంనుండి బౌద్ధయుగంవరకు గల సంఘర్షణల్ని తిలకించినట్లయితే యెన్నెన్నో విపరీతమైన మత ధర్మాలు బయలుదేరి, వున్నతమై, సనాతనమైన మతధర్మాలు మంటగలసిపోయినట్లు చరిత్ర పాఠకులకు స్పష్టమైనదే.

## —: సేచాచి అర్థించని సంఘం :—

ఈ పాత్ర బిరుదాంకితులైన నగరాలు అరువది నాల్గు కళల్లోను ప్రవేశం కలవారై రాజ్యాలు నశించినా క్షాత్ర ధర్మాన్ని విడువకుండా "పరోపకారార్థ మిదం శరీరం" అన్నట్టు బుద్ధభగవానుని ప్రబోధాన్ని శిరసావహించి వైద్యాన్ని, శిల్పాన్ని ముఖ్యవృత్తిగా జేసుకొని పర్వులకు విపత్సమయాల్లో ఉపకారులుగా

వుండి తమ దేశానికి, సంఘానికి గౌరవాన్ని చేకూర్చి రాజా జుల మెప్పు సంపాదించి ఇరువదిమొక్క మొఖాసా గ్రామాలకు పాలకులై సేచాచి అర్థించని సుక్షత్రియ సంఘ మిదియే యని యితరులు చెప్పుకొనేటట్లు ప్రవర్తిస్తున్నారు. కలకత్తా మొదలు చెన్నపట్టణం వరకు యీ నగరాల కులంలో మచ్చున కొక్క డైనా యీనాటివరకు యాచననే ప్రధానంగా చేసుకొని జీవించేవాణ్ని ఎవ్వరూ చూపించలేరు. అది మనజాతికి గర్వించ తగ్గ విషయం.

—: కళింగ పట్టణపు రేవు :—

ఈ రేవులో దిగినవారు మజ్జి, శంబాని, రాంపిళ్ళ, కొరికాని, కరణం, పార్ల, తొత్తడ, తోటూరు, మేడి, బెవర, మేడిపిళ్ళ, దురగాసి, బాల్లి, పైల, యాపర, పట్నాన, సగుర పిళ్ళ మొదలైన యింటిపేర్ల వారి మూలకుటుంబాలకు జ్ఞాతులు. వీరుమాత్రం చాలాభాగం సేద్య వాణిజ్యాది వృత్తులతోనే ప్రధానంగా జీవిస్తూ నిత్యకల్యాణం పచ్చతోరణంగా అపార ధన సంపన్నులై నాయకత్వాన్ని చెలాయిస్తూ నాయులు అనే బిరుదుతో సుఖజీవనం చేస్తున్నారు.

ఈ కళింగ పట్టణరేవులో దిగిన కొంతమంది గజపతు లతో స్నేహంచేసి మహాపాత్ర బిరుదుతో సామంతులుగా వున్నారు. వీరిజ్ఞాతులే కృష్ణదేవరాయాది ప్రభువులకు పక్కలో బల్లెములై భయవిభ్రమాల్ని కలుగజేశారు. వారే షోడశ

పాత్రులు. వీరిజ్ఞాతులలోని వాడైన బూరాడపాత్రుడు మాత్రం సకుటుంబంగా జలుమూరు గ్రామం చేరుకొని ఆర్యమతం స్వీకరించి యజ్ఞోపవీతధారణ గావించి ఉపనయనాది షోడశవైదిక కర్మల్ని ఆచరిస్తున్నారు. వీరినే మజ్జులని పిలుస్తారు. అందుండి విడిపోయినదే మజ్జి కుటుంబం. వీరు వశిష్ట గోత్రీకులు. ఈ మాదిరిగా గౌతమ మొదలైన గోత్రీకులు మజ్జులమనే గృహనామములతో వ్యవహరిస్తూ జలుమూరు గ్రామానికి ప్రభువులైనారు.

వీరి పరిపాలనలో వీరిచే నిర్మించబడ్డ కోటలు యీనాడు భూగర్భంలో కలియగా మిగిలియున్న దిబ్బలు కనిపిస్తూనేఉన్నై. వీరికి ఉదయం సాయంకాలం రాజహోదా సూచకంగా మేళతాళాలతో మేలుకొలుపు జరుగుతుండేది. వాద్య విశేషాలతో గాని రాజ దర్శనంగాదని ఆ చుట్టు ప్రక్కలవారు వీరిని బూరాడువారు అని పిలిచే వారట. అది రాను రాను యింటి పేరుగా మారిపోయింది.

ఆసేతుహిమాచల పర్యంతం యేకచ్ఛత్రాధిపత్యంగా పరిపాలించిన చంద్రగుప్తుని కాలంలోగాని, నాగావళి మొదలు ఉదయగిరి వరకు పరిపాలించిన రారాజు, ప్రతాపరుద్ర గజపతి కాలంలోగాని మఱేకాలంలో గాని హిందూదేశంలో గ్రామ స్వరాజ్య పరిపాలనమేగాని మఱియు చిన్న చిన్న సామంత రాజ్యాల ఐక్యతతో నెలకొన్న సంయుక్తరాజ్య పరిపాలనమే గాని ఎక్కడా నిరంకుశరాజ్య పరిపాలన లేనేలేదు. కప్పములు

తీసుకునే రాజ్యాలు వున్నప్పటికి యే ఒక్కడూ ఆసేతు హిమా చల పర్యంతం పరిపాలకుడుగా లేడు. ప్రజలే రాజ్య పరిపాలనా నిర్వాహణ భారాన్ని వహించేవారని ప్రాణప్రదమైన మన దేశ చరిత్రలు చెబుతున్నై.

ప్రజా యిష్టంతో సమర్థుడైన వాణ్ణి పాలకునిగా ఎన్ను కొనేవారు. ఆతడు విరాట్ అనే బిరుదుతో లేక నాయకు డనే బిరుదుతో ప్రజాభిప్రాయాల్ని శిరసావహించి పరిపాలించేవాడు. అటువంటి రాజ్యాలు యెన్నో ఉండేవి. గౌతమబుద్ధుడు, మహా వీరుడు, షోడశపాత్రులు మొదలైనవారు ప్రజాయుత రాజ్యా లకు సంబంధించినవారే. అట్టివారిలో జలుమూరు గ్రామ పాలకులైన బూరాడపాత్రుడుగా రొకరు.

కొన్నాళ్ళకి ఈ బూరాడవారివద్దనుండి జలుమూరు గ్రా మాన్ని పూసపాటివారు కబళించాలని వూహించారు కాని, వార నుకొన్నంత తేలిగ్గా స్వాధీనం కాలేదు. ఆ ప్రయత్నంలో వుభయ పక్షాలకు కొంత సంఘర్షణ జరిగింది. కాని, సాధ్యపడలేదు. దానితో పూస పాటివారు ఆ ప్రయత్నాన్ని విరమించుకొ న్నారు. ఆ సంఘర్షణలో బూరాడవారికి అండగా నిలిచినవారి లో కెల్ల సింగుపిళ్ళవారు ముఖ్యులు. ఇంకా మల్లరౌతు నారా యణ భూపతి, పైలి వెంకునాయుడు, చౌదరి ఆదిశేషు మొద లైనవారుకూడా బూరాడవారికి సహాయంగా వుండి పూస పాటివారిని యెదిరించారు. ఉత్తర హిందూస్థానంలోగల

"బందేల్ ఖండ" నివాసియైన సింగు అనే పేరుగల మహాబలవంతుడు పూసపాటి గజపతులకు సేనాధిపతిగా నుండి మహాయుద్ధ నైపుణ్యంతో ఎన్నో యుద్ధములలో అఖండ విజయాల్ని సంపాదించిపెట్టాడు.

ఈ జలుమూరు ప్రభువులయిన బూరాడవారితో పూసపాటి గజపతులు జరిపిన యుద్ధంలో ఈ సింగును పిళ్ళా వారు హతమార్చారు. అప్పటినుండి యీ పిళ్ళావారిని పూసపాటి గజపతులు సింగుపిళ్ళావారని పిలిచేవారు. ఆ సింగుపిళ్ళా నామమే యింటిపేరుగా కాలక్రమేణా మారిపోయింది.

## —: కళింగ నగర నిర్ణయం :—

మన జన్మభూమియైన తక్షశిలానగరం ఎక్కడ, యే స్థితిలో నున్నదో తెలుసుకోలేని స్థితిలో వున్న మనం కళింగ నగరాన్ని గురించి తెలుసుకోబోతున్నాం. అక్కడ వున్న మన నగరాల పూర్వ చరిత్ర తెలుసుకోవడానికి ముందుగా కళింగ నగరాన్ని గూర్చి తెలుసుకోవాలి. అసలు కళింగనగర చరిత్ర గూర్చి పూర్తిగా మనం తెలుసుకోవాలంటే కనీసం 10,000 పేజీల ఉద్గ్రంథ మౌతుంది. సవిమర్శగా వ్రాయటాని కిది తావుగాదు గనుక ముఖ్య విషయాలే యిందు పొందుపరుస్తున్నాను.

శ్లో॥ ఏకసాలే స్థాణుమతీం వినతే గోమతీం నదీం।
కళింగ నగరే చాపి ప్రాప్య సాలవనం తథా॥
(శ్రీ। మ। రా। అ। స। 61)

అయోధ్యా నగరానికి పశ్చిమంగా సాలవనం, దానికి పశ్చిమంగా కళింగనగరం వున్నట్లు పూర్వ చరిత్రకారుల గ్రంథాలవలన తెలుస్తున్నది.

ఈ కళింగనగరాధీశుడైన శక్రదేవుడు, ఆతని కుమారుడు చతురంగబల సమేతముగా కురుక్షేత్రమహాసంగ్రామంలో దుర్యోధనుడికి సహాయంగా వెళ్ళి యుద్ధం చేశారు.

((శ్రీ)॥ ఆం॥ మ॥ భా॥ భీష్మ పర్వం-84 అధ్యాయం)

మహాభారతకాలం నాటికి వింధ్య హిమాచల మధ్య ప్రదేశంలో గల గంగాసాగర సంగమానికి యివతల వైతరణీ నది మొదలు సముద్రతీరంవరకుగల భూభాగంలో యీ నగరాలు వ్యాపించి వున్నట్లు తెలుస్తున్నది.

ఈ కళింగులు పుండ్ర మగధజాతులకు చేరువలోవున్నట్లు విష్ణు పురాణములో చెప్పబడి వుంది.

భరత ఖండమండలి మధ్య ప్రదేశంలో కళింగ, మగధ, ఉత్కళ మొదలైన జాతులవారు వున్నట్లు బ్రహ్మాండ పురాణం వల్ల తెలుస్తోంది.

వరాహమిహురుని కాలంలో యీ కళింగులు అవంతి, మగధ జాతుల మధ్యభాగంలో నివసించి వున్నట్లు చరిత్రలవల్ల స్పష్టమాతున్నది.

రఘుమహారాజు సైన్యం కపిశానగరం దాటి ఉత్కల మీదుగా కళింగనగరం చేరినట్లు రఘువంశ కావ్యంలో వర్ణించ బడి వున్నది.

కళింగులు గంగానదీ ప్రాంతీయులని పాశ్చాత్య చరిత్ర కారుల గ్రంథాలవల్ల తెలియవస్తున్నది. ఏదియెట్లున్నా యీ కళింగదేశం గంగా గోదావరీ నదుల మధ్యప్రదేశం వరకు వ్యాపించి వున్నదని చెప్పటం సమంజసం. ఈ కళింగాన్ని గూర్చి చెప్పకొనటానికి నిదర్శనంగా కళింగ ఘాట్స్ **(Eastern ghats)** కనిపిస్తున్నై.

తెనాలిరామలింగడు తన గ్రంథాల్లో పిష్టపురాన్ని కళింగదేశానికి ఆభరణంగా వర్ణించి యున్నాడు. గంజాం మండలంలో కళింగ పట్టణమనే చిన్న రేవు కన్పిస్తున్నది. ఇంకా యీ కళింగదేశం గజపతుల కాలంలో దక్షిణాన కొండవీడు, ఉదయగిరినుండి ఉత్తరాన మిధునపురం వరకు వ్యాపించిఉంది. పౌరాణికయుగం కాలం నాటికే యీ కళింగదేశం 50,714 మైళ్ల చుట్టుకొలత కలిగియున్నట్లు తెలుస్తున్నది.

ఇంత వైశాల్యం కలిగి భారతీయుల యశశ్చంద్రికల్ని దశదిశల వ్యాపింపజేసిన యీ కళింగనగర సామ్రాజ్యం నవీన భారత రంగంలో చరిత్రకారులు ఎంత బుర్ర చెడగొట్టుకున్నా గ్గోచరం కావటంలేదు. అంత దిగంత విఖ్యాతి గాంచిన కళింగనగర స్వరూపమే నిర్ణయించలేక పోతున్నప్పుడు అచ్చటి

మన నగరాల చరిత్రను సక్రమంగా సేకరించి మీ యెదుట పెట్టాలంటే యెంత కష్టసాధ్యమో ఊహించండి!

జీవకళలు నాట్యంచేసే అపూర్వ కళానైపుణ్యంతో దిగ్దిగంతవ్యాప్త యశశ్చంద్రికలతో, వైరిజనహృదయ భేదనమై, ప్రజానురంజక పరిపాలనా విధానాలతో, నిఖిలవిద్యల కొజ్జమై వెలసిల్లిన కళింగ సామ్రాజ్యాన్ని గూర్చి, అచ్చటి నగరాలను గూర్చి స్వాతంత్రమంటే యేమిటో తెలుసుకొనటానికి ముఖ్యంగా మనమంతా తెలుసుకొని తీరాలి.

వీరకథాసుధారసతరంగడోలికల్లో దూగాడిన మీరు మీ జాతి చరిత్రను తెలుసుకున్నప్పుడే నిజమైన క్షత్రియ రక్తం మీలో ప్రవహిస్తుంది. మన ప్రాచీన తక్షశిలా కన్యా కుమారి కళింగ దేశ గడ్డపై దశదిశలు మారుమ్రోగునట్లు శంఖాన్ని పూరించి అరువదినాల్గు కళలేను ముప్పదిరెండు ముద్యాల ఘల్ ఘులా రవాలతో నర్తించింది. కళింగనగరంలో చేరిన మన నౌకల రత్నవ్యాపారవినోదం దేశదేశాలకు చదువు నేర్పింది. తక్షశిలానగర వీరఖడ్గం గోదావరి నదీస్థలి సాము జేసి రక్త సిక్తమై దక్షిణసముద్రంలో స్నానమాడింది. అట్టి ఆనాటి తక్షశిలానగర దివ్యజ్యోతి యీనాడు చెదురులేని దయింది.

కళింగ దేశంలో "వారణాసి కటకము, ఘాటూష్కరి కటకము, నగరి కటకము" అను మూడు ముఖ్యమైన కటకములుండేవని, అందు "మహాసామాన్తి, మహా సేనాపతి, మహా

మండలికుడు మొదలైన ముఖ్యరాజకీయోద్యోగులు నివసించే వారని తెలుస్తున్నది.

క్రీ. శ. 11,12,13,14,15 శతాబ్దాలలో కళింగ, గంగా, గజపతి రాజులవద్ద పాత్రులనేవారు సామంతులుగ వున్నప్పటికీ సర్వాధికారాలు యీ పాత్రులకే సంక్రమించి వుండేవి.

పొట్నూరు అనే గ్రామం విశాఖపట్టణం జిల్లాలో భీమునిపట్టణానికి పదహారుమైళ్ల దూరంలో చిట్టివలస నదీ తీరంలో వుంది. శ్రీకృష్ణదేవరాయలు కళింగదేశాన్ని జయించి నప్పుడు యీ పొట్నూరు దుర్గంలోనే జయస్థంభాన్ని నాటించాడు. ఆ దుర్గాధ్యక్ష సంతతివారే పొట్నూరు, పొట్నూరు అనే గృహనామాలతో పిలువబడుతున్నారు. ప్రస్తుతం ఆ జయస్థంభముయొక్క చిహ్నాలేమీ కనుపించటంలేదు. శిథిల మైనాయి. కృష్ణదేవరాయ పెండమంగళశాసనంలో పొట్నూరు దుర్గంలో జయస్థంభాన్ని నాటినట్లు వ్రాయబడివుంది. No 74 of 1903 Epigraphical Collectionsy నందును కృష్ణదేవ రాయ విరచితమైన ఆముక్తమాల్యద గ్రంథములోను జయ స్థంభాన్ని నెలకొల్పినట్లేవుంది. ఈ కృష్ణదేవరాయ విజయం 1414 సం. అంత్యంలోను 1415సం॥ ప్రారంభంలోను జరిగింది. 1518 సం॥ లో జయ స్తంభాన్ని నెలకొల్పినట్లు తెలుస్తోంది.

ఇంత వన్నెకెక్కిన యీ కళింగనగరం బౌద్ధమతాది నానావిధ మతాక్రాంతమై చాతుర్వర్ణ వ్యవస్థ నశించిన యీ

నగరవాసుల్ని వారి వారి పూర్వ తెగలకు విడదీసి చూపటం లోగల శ్రమ చరిత్ర నిర్మాతలకు తదభిమానులకు మాత్రమే గోచరిస్తుంది. పూర్వచరిత్రను పునరుద్ధరించటంలో చరిత్రకారుడు పడే అగచాట్లు యిన్ని యని చెప్ప నలవి గాదు.

మన ఆదిమ నివాసమైన నాగద్వీపం యేమైందోగాని, దుష్యంతుని కుమారుడు భరతుడు పాలించేనాటినుండి దీనిని భరతఖండమని పిలుస్తున్నారు. ఈ భరతఖండంలో గల 56 ముఖ్యనగరాలలో ఒకటై విరాజిల్లిన యీ కళింగనగర సామ్రాజ్యం అనేకమంది విజిత క్షాత్రపుంగవులకు ఆటపట్టయి నానా మతాలకి పుట్టినిల్లయి సమస్త శాస్త్రాలకి మూలస్థానమై వివిధ విద్యా విశారదులకు మార్గదర్శియై విలసిల్లినట్లు పురాణేతిహాసాలవల్లా, శిలాతామ్ర శాసనాలవల్లా ఎంతో కొంత యెరుకబడివున్నప్పటిగ్గూడా ఈ కళింగ నగరాన్ని యిదమిద్ధంగా నిర్ణయించటానికి యే చరిత్రకారుడికి శక్తి చాలటం లేదు. ఎవని యూహకు తగ్గట్లు వాళ్లు నిర్ణయాలు చేస్తూ యీనాటిగ్గూడా వాళ్ళలో వాళ్లు విమర్శలు చేసుకొంటూనే యున్నారు.

---

—: కళింగ బ్రాహ్మణులు శూద్రులగుట :—

1. హిమాలయ ప్రాంతాల్లో నివసించే బ్రాహ్మణులు గొల్లవాళ్ళమాదిరి వేషభాషలతో సేవకా వృత్తితో వర్తక వ్యాపారాలు చేసుకుంటూ చుట్టుపట్లగల మిగతా జాతుల్లో కలసి జీవిస్తున్నారు.

2. కాంగ్రోవియాలో వున్న బ్రాహ్మణులు వ్యవసాయ వృత్తితో జీవిస్తున్నారు. నూతనంగా మైదాన ప్రదేశాలనుంచి కొంతమంది బ్రాహ్మణులు అక్కడకు వలసవచ్చి అక్కడవుండే సామంత భూపాలకులవద్ద పురోహితులుగా వుంటున్నారు. పార్వతీయ బ్రాహ్మణులు మాదిరి గాకుండా వీరు మాంసాహారాన్ని వర్జిస్తారు. పార్వతీయులు పూర్వం మాదిరిగా పూజారి వృత్తితోనే జీవిస్తున్నారు. వీరి తర్వాత వచ్చిన బ్రాహ్మణులు గూడ అదే వృత్తిని అవలంబిస్తున్నారు.

3. పాటియాలా బ్రాహ్మణులు కూలి నాలి చేసుకుంటూ పల్లకీలను మోసి జీవిస్తున్నారు.

4. గంగా యమునా నదుల మధ్య ప్రదేశంలోగల కొంతమంది బ్రాహ్మణులు వ్యవసాయ వృత్తితో జీవిస్తున్నారు. వారిలో దూసా ప్రాంతీయులకు విధవా వివాహాలు చేసుకొనే ఆచారం వుంది. వీరు ప్రత్యేక వర్ణంగానే వున్నారు.

5. జయపురంలోని బ్రాహ్మణులు యజ్ఞ యాగాది క్రతువులకు గౌరవ స్థానం యివ్వటానికే ప్రత్యేకింపబడిన

వారుగా వున్నారు. వీరిలో కొంతమంది అయోధ్యకు వలస వెళ్ళారు గాని, అచటి బ్రాహ్మణులు వీరిని తమలో కలుపు కోటానికి తిరస్కరించారు.

అయోధ్య రాజొకడు లక్షమంది బ్రాహ్మణుల ఆధ్వర్యంలో ఒక యజ్ఞాన్ని చేయటానికి సంకల్పించి, సాధారణ శూద్రులక్కూడా యజ్ఞోపవీత ధారణార్హత నిచ్చి లక్షమంది బ్రాహ్మణుల్ని తయారుచేసి యజ్ఞాన్ని సంపూర్తి చేశాడట! వీరిలో కొంతమంది శ్రీకృష్ణ భగవానుడే వాళ్ళ నావిధంగా బ్రాహ్మణుల్ని చేసినట్లు చెప్పుకొంటున్నారు. తక్కినవారు క్షత్రియ కులస్తులుగానే చెప్పుకొని తృప్తిపడ్డారు. బెనారెస్ జిల్లాలోను, గంగానదీతీరం పొడుగునాగల వ్యవసాయదారులంతా బ్రాహ్మణులమనే చెప్పుకొంటారు. పూర్వకాలంలో బ్రాహ్మణులకుమాదిరిగానే వీరిక్కూడా మరణ దండన విధింపబడేదికాదు. బీహార్ రాష్ట్రంలోగల భగల్పూరు జిల్లాలో నివసిస్తున్న బ్రాహ్మణులలో నూటికి డెభ్భై అయిదుమంది వ్యవసాయ వృత్తితో జీవించటమేగాక అయోధ్యలో నూతనంగా సృష్టించబడ్డ లక్షమంది బ్రాహ్మణుల సంతతిలోవాళ్ళమనే చెప్పుకొంటారు. ఒరిస్సాలో జాజిపూర్ జిల్లాయందుగల్ల బ్రాహ్మణులు బంగాళా దుంపల్ని పండించుకొంటూ జీవిస్తున్నారు. ఈవిధంగా వృత్తిచేతనే గాకుండా జాతిచేతనుకూడా ఎక్కువ తక్కువలతో వున్నారు.

## కన్నడ బ్రాహ్మణులు (కర్ణాట బ్రాహ్మణులు)

ఇది పంచద్రావిడ శాఖలలో నొకటి. వీరును, మన నగరాల మాదిరిగానే కాలవశమున స్వస్థానమైన కర్ణాట దేశమును విడచి వేర్వేరు కులముల చీలిన కర్ణాటక శాఖలు 13 నేటికి గాన్పించుచున్నయవి. వీరు శాఖాహారులుగానే యున్నారు. అద్వైతులగు స్మార్తులుగ కొందరును ద్వైతులగు వైష్ణవులుగ మరికొందరును నుండిరి. ఈ వైష్ణవులు ఆనందతీర్థ స్వామి శిష్యులుగాని, రామానుజీయ వైష్ణవులుగారు. ఆంధ్ర దేశమున స్థిరులయినవారు ఈ పై వైష్ణవులయినను మధ్వులని పిలపించుకొనుచున్నారు. కన్నడదేశమునగల రామానుజీయ వైష్ణవులు ద్రవిడ దేశస్థులేగాని ఉత్తర హిందూస్థానము వారెంతమాత్రముగారు.

1. కన్నడ బ్రాహ్మణశాఖ, 2. అరవతొక్కలు, 3. ఉరుచిబ్రాహ్మణశాఖ, 4. కుమ్మెశాఖ, 5. నగరబ్రాహ్మణ శాఖ, 6. బొబ్బర బ్రాహ్మణశాఖ, ఈ ఆరు శాఖలవారిని గూర్చి కన్నడ స్మార్తులనుటకన్న యేమియు దెలియరాకున్నది.

ఇంకను 7. కన్నడ స్మార్తవులు 9. నంబూరి బ్రాహ్మణులు ఇందు మరిరెండు తెగలుగా నున్నారు. 1.నంబూరీలనియు 2. మళయాళదేశపు నంబూరీలనియు, మళయాళదేశమందు పెక్కండ్రు గానుపించుచున్నారు. 9. అమలవాసీలు. వీరు స్మార్తశాఖ, 10. పొట్టిబ్రాహ్మణశాఖ, 11. ముత్తుదుబ్రాహ్మణ

శాఖ, 12. పట్లురీబ్రాహ్మణశాఖ, 13. వైష్ణవులు, వీరుద్వై వతులు. ఆనందతీర్థ శిష్యులు. ఈ వైష్ణవులు ఆంధ్ర దేశమున కాపురములు కుదిరి మధ్వు లనిపించుకొనుచున్నారు. వీరిలో లౌక్యు లందరును రావు, రాయరు, గౌడ యను బిరుదునామములను, వైదిక వృత్తిచే జీవించువారు ఆచారిగళు అను బిరుదు నామమును పేరునకుంబిదప నుంచు కొందురు.

కృష్ణా నదీతీరంలోను, మలబారులోను, మైసూరులోను అనేకమంది పతితులైన బ్రాహ్మణులున్నారు. ఇటువంటివారే పౌన్నాడలో వున్న బ్రాహ్మణులు. మధుర జిల్లాలోని బ్రాహ్మ ణులుగూడా యీ విధంగా పతితులైన వాళ్ళనే వాడిక వుంది. సింహళద్వీపంలో గూడా బ్రాహ్మణేతరులు బ్రాహ్మణులుగా మారిపోవటం కనిపిస్తున్నది. ఈ విధమైన మార్పులు ఆదికాలం నుంచి నేటివరకు జరిగిపోతూనే వున్నై. హంటర్ అనే యాత్రి కుడు తన హిందూదేశ పర్యటనలో దేశకాల మార్పుల్ని, జాతుల్ని, మతాల్ని గూర్చి వర్ణిస్తూ ప్రత్యేకంగా వ్రాసిన "ఒరిస్సా" అనే గ్రంథంలో యీ విషయమంతా వ్రాయబడి వుంది.

—: క ళిం గ కో మ ట్లు :—

ఈ కళింగ కోమట్లలో కులాచారాల్ని, కుల మర్యా దల్ని కాపాడుకొంటానికి కొన్ని కట్టుబాట్లున్నై. వీరిలో అంధ

వరపువారిలో కొంతమందిని వైశ్యరాజులుగాను, కొన్ని యింటి పేర్లవారిని (బహుశాః పదహారు యింటిపేర్లు కావచ్చు) పాత్రులు గాను నిర్ణయించబడినారు. శుభకార్య కలాపాల్లో చందన తాంబూలాదులు రాజులకు మూడు రెట్లు, పాత్రులకు రెండు రెట్లు యిచ్చేవారు. కులాచారాల్ని సక్రమంగా పాటింపచేట్లు చేయటానికి పెద్ద కోమటి, పురశ్రేష్టి, సేనాపతి మొదలైన బిరుదులతో కొంతమంది కులాధికారు లుండేవారు. వీరి కుల వ్యవస్థ పూర్వకాల మందలి గజపతిరాజుల రాజ్యాంగ వ్యవస్థను బోలివున్నది.

ఈ తాంబూలాన్నిచ్చే సాంప్రదాయం పూర్వం పాత్రులు సామంత ప్రభువులుగా వున్నప్పటినుంచీ గూడా వున్నట్లు కనబడుతోంది. రాను రాను ఈ సాంప్రదాయం నశించిపోయి వివిధ మత విజృంభణాలతో అనేక సాంప్రదాయానలంబకులై మాంసభుక్కులై రాజెవరో-బంటెవరో తెలియు లేని స్థితి కలిగింది.

ఆర్యుల్లో మాదిరిగానే యీ కాళింగులగ్గూడా చాతుర్వర్ణ వ్యవస్థ వుంది. కాని, వైశ్యులు, శూద్రులు మాత్రమే నేటికి కన్పిస్తున్నారు. మిగతా బ్రహ్మ, క్షత్రియ జాతులు రెండూ శూద్రులుగానే పరిగణించబడుతున్నై.

ఈ విధంగా ఎక్కువజాతివారు తక్కువ జాతిగాను, తక్కువ జాతివారు ఎక్కువ జాతిగాను దేశకాల పాత్రోద్

తవ్యవస్థల్ని బట్టి మార్పు చెందటం సోదర పాఠక మహాశయు లకు తెలియంది గాదు.

ఈ కళింగరాష్ట్రం శ్రీమద్రామాయణ స్కాంధపురాణ భారతాదుల్లోను, వేదాల్లోను పేర్కొనబడినట్లుగా ఆంధ్ర దేశంలో సుమారు 500 చ॥ మై॥ విస్తీర్ణం కలిగి క్రీ॥ శ॥ 9వ శతాబ్దంనాటికే అష్టైశ్వర్యాలతో తులతూగుతుండేదని తెలుస్తోంది,

—: భీమునిపట్నం రేవు :—

భీమునిపట్నం రేవులో కొంతమంది రాజ బందుగులు రాజకుమారునితో సహా దిగారు. వారిలో గురుమహంతు, సుఖవాసి, సంపదరావు, సత్యాల, శీలము, భోగాల, చౌదరి, మజ్జి, పిళ్ళ, బూరాడ, రామదేవు, ముదిలి, మాకెన, మొదలైన ముఖ్యకుటుంబాల వాళ్లున్నారు. వీరంతా రాజకు మారుణ్ణి కాపాడుకొంటూ భీమునిపట్నంలో స్థిరనివాసాలేర్ప రచుకొన్నారు. రాజకుమారుడికి చక్రవర్తులవారనే గృహనా మాన్నివుంచి అంతా పిలుచుకొనేవారు. ఆచక్రవర్తి అనే నామం స్థిరపడి కాలక్రమేణా యింటిపేరుగా ఉచ్చారణదోషం వల్ల చక్రాతిగా మారిపోయింది. ఈ చక్రాతి చక్రవర్తి అనే యింటిపేరు గలిగిన ఆరాజకుమారుని సంతతివారు యిప్ప టికీవున్నారు. పైకుటుంబాలవారే చాలావరకు యీ చరిత్రకు మూలధనంగా వున్నారు.

యూరప్ దేశస్థులు మనదేశంలో స్థిరనివాసా లేర్పరచు కొంటున్న కాలంనాటికే యీ పైకుటుంబాలవారు ఆంగ్లభాషా కోవిదులై, ఉన్నతోద్యోగస్థులై ఐశ్వర్యవంతులై, వీరపరాక్రమ కళాసార్వభౌములై, జగద్విఖ్యాత పురుషులై ప్రకాశించారని ఘంటాపథంగా చెప్పవచ్చు. ఆ రాజకుమారుని జ్ఞాతివర్గంవారు చాలాకాలంవరకు యితర దేశాలతో ఓడలద్వారా వర్తక వ్యాపారాలు జరిపినట్లు ప్రబల నిదర్శనములతో తెలుస్తోంది. ఈ చక్రవర్తికుటుంబంలో విఖ్యాత పురుషుడైన చిన్నయ్యా పాత్రుడుగారి దివ్యభవనానికి శ్రీశ్రీ విజయనగర మహారాజు ఎన్నోసార్లు విచ్చేసి చిన్నయ్యా పాత్రుడుగారిచే సన్మానించబడి నట్లు ప్రతీతి.

ఇహాను చౌదరి కుటుంబీకుల్లో ప్రముఖుడైన రంగప్ప పాత్రుడుగారు నిఖిలైశ్వర్య సంపన్నులై ఏనుగులు, గుఱ్ఱములు, వాహనములు, మొదలైన మహారాజోచిత పరివారంతో కీర్తి పతాకాన్నెగురవేస్తున్నారు.

గురుమహంతు కుటుంబంవారి సంతతిలో ముఖ్యులైన గుఱ్ఱన్న పాత్రుడుగారు ఉపదేశకులుగానే ఉండేవారు.

సుఖవాసివారి జ్ఞాతుల్లో ముఖ్యమైనవారు రామన్న పాత్రుడుగారు. వీరి పూర్వులు పూర్వం తక్షశిలా నగరంలో వున్నప్పుడు బహు సుఖ భోగ లాలసత్వాలతో జీవించేవారు, గనుక వీరికి సుఖవాసి అనే యింటిపేరు యేర్పడింది.

## నాగులచవితి:—

ఈ నాగ సంతానమును శత్రుశేషము లేకుండా చేయవలయుననెడి ఆర్యుల తలంపే జనమేజయ సర్పయాగము. ఆ యాగము వలన పట్టువడిన నాగరాజుల సంఖ్యఅగోచరము. యాగగుండమున దగ్ధముకాగా తప్పించుకుని బ్రతికి బైటబడినవారు "కళింగ నగరము, అమరావతి, మైసూరు," (మహిష పురము) చేరుకుని ప్రాణములు రక్షించుకొనిరి. వేదకాలము నుండి జనమేజయ సర్పయాగమువరకు తక్షశిలానగరమున జరిగిన హత్యలన్నియు చదువరులిదివరకే గ్రహించియున్నారు. కాని సర్పయాగమునుండి నేటివరకు మనయందు ఆర్యజాతికి వైరానలము చల్లారినట్లు స్ఫురింపదు. నేటికినీ యేదో యొక మిషచే పగ సాధించుచునే యున్నారు. అందు ఈ "నాగుల చవితి" ఒకటి.

కార్తిక శుద్ధ చవితి "నాగుల చవితి". ఈ దినముననే ఖాండవ దహనముగాని లేక జనమేజయ సర్పయాగముఁగాని జరిగియుండ నోపు. అదియునూ కాకపోయిన వృత్రాసుర దేవేంద్రుల పోరుయందు వృత్రుఁడు గతించిన దినమైనను అయి యుండును. ఏది యెటులైనను ఒక నాగ ప్రముఖునకు సంభ వించిన మృత్యుఘటననే ఈ "నాగులచవితి" చిహ్నము.

ఈ నాగులచవితి బహుశ్రద్ధగా చాతుర్వర్ణములవారు నేటికినీ చేయుచునే యున్నారు. ఈ పూజ సర్పయాగము

వంటిది కాకపోయినను ఖాండవవన దహనము వంటిది అని చెప్పక తప్పదు. ఈ పర్వదినము ముఖ్యముగా మన దైవ చిహ్నమైన సర్ప సంహారమునకై ఆర్యులు పన్నిన కుతంత్ర మని విచక్షణా చక్షువునకు గోచరించకపోదు. ఈ పూజకు ముఖ్యముగా చిమ్మిలి, (నువ్వులు, బెల్లము కలిపి త్రొక్కినది) ఫలహారముగను, పంచదార కలిపిన పాలు అమృతముగాను ఉపయోగించెదరు, చాలామంది కోడి గ్రుడ్లను కూడా నివేదించెదరు.

ఈ చవితి దినమున ఉపవసించి మడితో పుట్టవద్దకు జేరి పై చెప్పిన పూజాద్రవ్యములు ఒకచోనుంచి గోమయముకలిపిన నీళ్లను పుట్టపై చిలుకరించి, బియ్యపు పిండితో ముగ్గులువైచి, దీపారాధన గావించి ముందుగా ఆ పుట్ట బెజ్జములో పాము గళమునకు అడ్డముగా కోడిగ్రుడ్డును వైచెదరు. తదుపరి బెల్లము నువ్వులతో తయారు చేసిన చిమ్మిలి వుండలను వైచి పంచదార కలిపిన పాలు పోయుదురు. సాంబ్రాణి, కర్పూరము, ధూప దీపములువైచి టెంకాయను కొట్టి చిన్న చిన్న ముక్కలుగా చేసి అరటిపండ్ల ముక్కలతో కలిపి ఆ పుట్ట బెజ్జములో క్రుక్కెదరు.

ఈ తంతంతయూ చేయువారు నాగేంద్రునకు ఆహారము వైచి పూజించుచున్నామని భ్రమించెదరు. తదుపరి నాగధోతు లనియు, నాగదుప్పట్లనియు, నాగవస్త్రములనియు కొన్ని క్రొత్త

బట్టలను అచటవుంచి నాగచిహ్నమైన పుట్టకళ్లు పెట్టి నమస్కరించి ఆ వస్త్రములను ఆరోజు ధరించెదరు.

మరికొందరు సంతోషముతో మందుగుండు సామానులను కాల్చెదరు. అమాయిక ప్రజలను మోసగించి ఆర్యులు తమ కార్యమును సాధించుకొనుటకు పన్నిన కుతంత్రమేగాని భక్తిమాత్ర మెన్నటికినీ కాదు. వాస్తవమును ఆలోచించినచో ఇది నాగులయందు పగ సాధించుటయేయని తేటతెల్లముగా గోచరించును.

ఇహాను చీమల పటాలములు ఆ పుట్టలో భక్తిపరులు వేసిపోయిన ఫలహారములకాశించి పుట్టలోనికిజొరబడి అందుండు మన దైవచిహ్నమైన సర్పశరీర మాద్యంతము పైమధురరసంచే తడిసియుండుటవల్ల సర్పరాజుయొక్క శరీరమును ఈ చీమలదండు ముక్కముక్కలుగాశల్యగతమై అశువులువీడువరకుభక్షించును.

"బలవంతమైన సర్పము చలిచీమలచేతజిక్కి చావదె సుమతి"

ఈ పూజా కుతంత్రము తెలియని నాగరాజ వంశీయులమైన మనముకూడా ఈ దినము పర్వదినముగా భావించి పై విధముగా చేయుచున్నారమే కాని మన జాతీయ దైవ చిహ్ననాశనకరమని యెరుంగలేకున్నారము.

మహమ్మదీయులను గెలిసేయుటకై పూర్వము హిందువులు వీర్లపండుగ చేసెడివారు. అట్టి హిందువుల పండుగ రాను

రాను మహమ్మదీయులకు ముఖ్యమైన పండుగ దినముగామారి అస్సేన్, హుస్సేన్ శిరములకు బదులుగా పీర్లనుజేసి వాటి గుదమందు కర్రలను తగిలించి అగ్నిగుండములలో గెంతు చుండుట మనము కనులార గాంచుచుంటిమి. అట్లే నాగుల చవితియొక్క రహస్యమును గుర్తించలేక మన కులదేవతయైన నాగరాజును క్రూరముగా వధించుచున్నారము.

నాగులచవితి పండుగ దినముగా మనము చేయదగ్గదే. కాని ఈ విధమైన కుతంత్రము కూడదు. ఆరోజున మన మూలపురుషుల జ్ఞాపకార్థముగా అన్నదానముచేయుట, వస్త్ర దానము చేయుటయే ఆచరణీయము. ఈ దినము మనజాతికి చాలా విషాదకరమని మరువకుడు. నాగులపంచలు మొదలైనవి ఆనాడు ధరించి మన పూర్వచరిత్రను తలంచుకొని మనకు సంబంధించిన నాగచరిత్రలను శ్రవణముచేయుట మనకే గాక శూద్రులని పిలువబడుచున్న వారందరికిని విద్యుక్త ధర్మమైయున్నది.

—:వలస గ్రామాలు: జనాభా:—

తక్షశిలా నగరమునుండి చెదిరిపోయి 1936 సం॥ నాటికే షుమారు 200 గ్రామములలో గుంపులు గుంపులుగా వుండి పోయిన కుటుంబములవారి జనాభా యీ విధమున కానవగు చున్నది.

| గ్రామము. | కుటుంబములు. | జనాభా. | గ్రామము. | కుటుంబములు. | జనాభా |
|---|---|---|---|---|---|
| చెన్ననగరము | 5 | 25 | అలమండ | 2 | 15 |
| తెనాలి | 3 | 21 | కోడూరు | 1 | 3 |
| విజయవాడ | | | మాడుగుల | 10 | 33 |
| భీమవరము | 2 | 9 | గుడివాడ | 1 | 5 |
| ఏలూరు | 1 | 7 | కొండకర్ల | 3 | 11 |
| తాడేపల్లి | 1 | 2 | ఇరువాడ | 16 | 64 |
| రాజమహేంద్రవరం | 13 | 75 | దేశపాత్రునిపాలెం | 11 | 33 |
| బిక్కవోలు | 2 | 6 | పంచదార్ల | 2 | 9 |
| ద్రాక్షారామము | 2 | 6 | కడియము | 1 | 5 |
| సామర్లకోట | 6 | 22 | మలకాపురము | | |
| లక్ష్మీనరసాపురం | 4 | 12 | ఏరాడ | 230 | 10,46 |
| పెద్దాపురము | 41 | 104 | విశాఖపట్టణము | 90 | 374 |
| వుప్పాడ | 1 | 8 | అడివివరము | 2 | 7 |
| కాకినాడ | 6 | 24 | మూలపేట | 1 | 5 |
| యెలమంచిలి | 2 | 8 | చీపురపల్లి | 5 | 17 |
| తుని | 1 | 5 | నరవ | 1 | 6 |
| అనకాపల్లి | 11 | 77 | భీమాడ | 1 | 2 |
| చోడవరము | 3 | 12 | పార్వతీపురం | 2 | 16 |
| అల్లమండ | 1 | 7 | (పిలకవానిపాలెం) | | |
| దేవరాపల్లి | 2 | 20 | పోతినమల్లయ్యపాలెం | 31 | 191 |
| | | | చంద్రమ్మపాలెం | 58 | 280 |

| గ్రామము. | కుటుంబములు. | జనాభా. |
|---|---|---|
| లక్ష్మిదుపాలెం | 15 | 65 |
| బక్కన్నపాళెము | 45 | 236 |
| కొత్తకొమ్మాది | 18 | 70 |
| రేవళ్ళపాళెము | 26 | 108 |
| కొమ్మాది (నగరపాళెము) | 12 | 49 |
| మధురవాడ | 39 | 230 |
| వీరఘట్టామ్ | 1 | 3 |
| పెద్దిపాళెము | 28 | 127 |
| తాళవలసమధురామినిపేట | 50 | 209 |
| పందలపాక | 7 | 38 |
| దుక్కవానిపాళెం | 61 | 233 |
| మెట్టమీాదదుక్కవానిపాళెము | 6 | 29 |
| చిట్టివలసదధినగరపుపాళెము | 97 | 531 |
| తరగపువలస | 30 | 195 |
| రఘుమండ (ముడసర్లోవ) | 133 | 741 |
| సంతపాళెము | 6 | 20 |
| (మజ్జులపేట) | | |
| కూర్మరాజపురము | 6 | 20 |
| జలుమూరు | 25 | 83 |
| ఆముదాలవలస | 20 | 71 |
| బూర్జవలస | 1 | 6 |
| తాతానగరము | 6 | 28 |
| విజయనగరము | 12 | 36 |
| సింహాచలము | 1 | 8 |
| కొత్తవలస | 1 | 6 |
| నౌరంగపురము | 1 | 7 |
| ఛత్రపురము | 2 | 5 |
| బాళేశ్వరము | 2 | 7 |
| కటకము | 2 | 4 |
| పూరిజగన్నాధము | 1 | 3 |
| కురుదారోడ్డు | 6 | 18 |
| పలాస | 2 | 7 |
| పూండి | 1 | 4 |
| నౌపడ | 1 | 2 |
| హిరమండ | 1 | 3 |
| చిట్టివలస | 2 | 7 |
| బొబ్బిలి | 2 | 6 |

| గ్రామము. | కుటుంబములు. | జనాభా. |
|---|---|---|
| పర్లాకిమిడి | 1 | 5 |
| (గోట్టెగుమ్మ) | | |
| జయపురము | 1 | 10 |
| సాలూరు | 1 | 6 |
| కలియకొండ | 1 | 4 |
| మన్సార్‌పూర్ | 1 | 4 |
| కరక్‌పూర్ | 3 | 21 |
| యేలేశ్వరము | 1 | 1 |
| పాలకొల్లు | 8 | 32 |
| కళింగపట్టణము | 86 | 419 |
| వెదుల్లవలస | 52 | 275 |
| అమకామ్ | 33 | 177 |
| (గుంటూరు జిల్లా) | | |
| శీతానగరము | 1 | 2 |
| కలకత్తా | 20 | 71 |
| నిమ్మవలస | | |
| పొదిలామ్ | | |
| సోడిపాళెము | | |
| మల్లయ్యపేట | | |
| సాలియ్యపేట | | |
| పాడలి | | |
| కొల్లువలస | | |

| గ్రామము. | కుటుంబములు. | జనాభా. |
|---|---|---|
| శివుడువలస | | |
| చినకురుమ్‌పేట | | |
| గంగమ్మపేట | | |
| పెద్దకురుమ్‌పేట | | |
| బూర్జి | | |
| కొత్తూరు | | |
| రామచంద్రపురము | | |
| పెరుమాళ్ళి | | |
| (పోస్టుజామీ) అరిసిబలగాం | | |
| అడ్డూరిపాళెము | | |
| రాజామ్ | | |
| చొక్కారపాళెము | | |
| నందిగ్రామము | | |
| శ్రీకాకొళము | | |
| శ్రీకూర్మము | | |
| పాలకొండ | | |
| (బూర్జిదగ్గర) ఉవ్వపేట | | |
| కాకిండాము | | |
| మల్లయ్యపేట | | |
| (పెరుమాళ్లదగ్గర) | | |
| అరసబలగామ్ | | |
| సిమిడివలస | | |
| పొడలి | | |

## —: ఇంటిపేర్ల వివరములు :—

అడ్డూరి; అరెసిపిళ్ళ;— ఇసుపిళ్ళ; ఇద్దుపిళ్ళ; ఇలుపిళ్ళ; ఇళ్లుపిళ్ళ; — ఉట్టు; ఉట్టి — ఏరాడ; ఏనుగుల — కరణము; క్రి; కత్తుల; కసిశెట్టి; కిలారు; కాటుపిళ్ళ; కామందుల; కాముదులి; కురిట్; కూనిపిళ్ళ; కొప్పరోతు; కొరగంజి; కొరికాని; కంచుపిల్ల గరియా; గరి; గరె; గూడేల; గుజ్జారు; గురుమహంతు; గుండు— చక్రవర్తి; చీపుళ్ళ; చక్కర; చౌదరి; జగుపిళ్ళ— డోకర;— తమ్మిన; తొత్తడ; తొత్తర; తోటారు— దురగాసి; దుక్కదేవిన— నాగోతి; నాగుపిళ్ళ నెర్జి— పట్నాల పట్నాన; పార్ల; పిళ్ళా; పీస; పోతిన; పొట్లూరు; పాట్నారు; పొట్రు; పైల; పైడిపాటి; పైడిపోతు; పోలిన; పండు—

బయపిళ్ళ; బంక; బంకు; బాయి: బాయన; బొల్లు బొల్లి; బోగాల; భోగవల్లి; భోగవెల్లి; బూరాడ; బెవర; బెహర; బైపిళ్ళ (బెవర—మంతిన, మగ్గూరు; మలుకోతు;మజ్జి; మజ్జుల; మడ్డు; మరుపిళ్ళ: మాకెన; ములంపాక; ముంజేటి ముదిలి; మేడె;— యూపర — రాంపిళ్ళ; రాంపళ్ళి; రామదేవు; రాజగిరి; రామిని; రాయని; రాయి; రాజముదిలి; రాచపల్లి; — లండ;— వడ్డాది; వాడస; వాంద్రాసి; వారణాసి; వజ్జె, వొజ్జ; వోని; వడిపెన; వేపార; వీధి — శంచాన; శానం; శార్న; శీరమ్; శీలం శింగుపిళ్ళ — సత్యాల; సంపదరావు; నగురుపిళ్ళ: సంబా సారెపిళ్ళ, సుఖవాసి సుఖాసి; క్షీరం.

## నాగేశ్వర గోత్రీకులు.

1. గునునుహాంతువారు
2. సత్యాలవారు
3. సింగుపిళ్ళవారు
4. సంపదరావువారు
5. సుఖవాసివారు
6. పూకెనవారు
7. పిళ్ళావారు
8. కిలారివారు
9. ఏనుగులవారు
10. దుక్కవారు
11. చింతాడవారు

## నాగేంద్ర గోత్రీకులు.

1. జగుపిళ్ళవారు
2. కూనిపిళ్ళవారు
3. చీపుళ్ళవారు
4. కంచుపిళ్ళవారు
5. ఇద్దుపిళ్ళవారు
6. సింగుపిళ్ళవారు
7. సగురుపిళ్ళవారు
8. బంకవారు
9. పొట్నూరువారు
10. కొయివారు
11. వజ్జివారు
12. కనిశెట్టివారు
13. కొరగంజివారు
14. పైలవారు
15. పైడిబోతువారు
16. పైడిపాటివారు
17. ఉట్టివారు
18. రామదేవువారు
19. మజ్జులవారు
20. పార్లవారు
21. గూడేలవారు
22. మంతెనవారు
23. నల్లానివారు
24. వాండ్రాసివారు
25. వారణాసివారు
26. వాడసవారు
27. డొక్కరవారు
28. దుక్కవారు
29. చక్రాతివారు
30. బ్రెవరవారు
31. పీసవారు
32. బాయనవారు

33. సుఖాసివారు
34. దాశినవారు
35. పైడివారు
36 బొల్లివారు
37. చొక్కరవారు
38. వడిపెనవారు
39. దిబ్బవారు
40. పయిలవారు
41. లంకావారు

రావారు గోత్రీకులు

1. గుజ్జారువారు
2, రాంపిళ్ళవారు
3. ఇళ్లపిళ్ళవారు
4. ఇల్లిపిళ్ళవారు
5. ఎరిపిళ్ళవారు
6. పోతినవారు
7. ఝూదివారు
8. వాంద్రాసివారు
9. డొకరవారు
10. కొరగంజివారు
11. మంతెనవారు

రావిపాల గోత్రీకులు

గుజ్జారువారు

రావిపళ్ళ గోత్రీకులు

పోలినవారు

యజ్ఞేశ్వర గోత్రీకులు

1. తమ్మినవారు
2. గరెవారు
3. తొత్తడివారు
4. రాయనివారు
5. సానంవారు
6. మరుపిళ్లవారు
7. కాటుపిళ్లవారు
8. పిళ్లావారు.

విగ్నేశ్వర గోత్రీకులు.

1. పిళ్లావారు

నెమలిపురి గోత్రీకులు.

1. దేవినవారు
2. అరిసిపిళ్లవారు
3. బయుపిళ్లవారు

అప్పేశ్వర గోత్రీయులు.

బాయనవారు

సర్వేశ్వర గోత్రీయులు.

1. బాయనవారు

తాంబేలు గోత్రీకులు

1. అడ్డూరివారు

కూర్మావతార గోత్రీకులు.

1. శీరంవారు
2. శీరమువారు
3. శీలమువారు
4. క్షీరమువారు

కూర్మాల గోత్రీకులు

1. మల్లరౌతువారు
2. అడ్డూరివారు
3. చీపుళ్లవారు
4. పట్నాలవారు
5. బ్రెవరవారు

శ్రీకూర్మ గోత్రీకులు

1. మగ్గూరువారు
2. సింగుపిళ్లవారు

పిప్పిళ్ళపత్ర గోత్రీకులు

1. గుజ్జూరువారు

పాలేసు గోత్రీయులు

1. కామందులవారు
2. కాముదిలివారు
3. ముదిలివారు

పులేసు గోత్రీయులు

1. కిలారువారు

పాలాకు గోత్రీయులు

1. దుర్గాసివారు

పాలేటి గోత్రీయులు

1. దుర్గాసివారు

పాలా గోత్రీయులు

1. బ్రెవరవారు

కావేరి గోత్రీయులు

1. రాజగిరివారు
2. కోరికానివారు

సింహాద్రిఅప్పన్న గోత్రీకులు

1. భోగాలవారు
2, భోగవెల్లివారు
3, భోగవల్లివారు

పాలవల్లి గోత్రీయులు

బెవరవారు

ఆదొండ గోత్రీయులు

నాగోతివారు

గౌతమముని గోత్రీకులు

బూరాడవారు

ఏ యింటిపేరున యెంతమంది జనాభా.

| యింటిపేరు. | కుటుంబములు. | జనాభా | యింటిపేరు. | కుటుంబములు. | జనాభా |
|---|---|---|---|---|---|
| 1 అడ్డూరి | 45 | 205 | గురుమహంతు | 2 | 12 |
| 2 అరిసిపిళ్ళ | 30 | 200 | 21 గ (రి) కె | 35 | 175 |
| 3 ఇసుపిళ్ళ | 264 | 40 | 22 గుజ్జారి (రు) | 120 | 490 |
| 4 ఇద్దుపిళ్ళ | 10 | 40 | 23 గూడేల | 60 | 242 |
| 5 ఇలి (ళ్లు) పిళ్ల | 50 | 240 | 24 చక్రవర్తి | 10 | 50 |
| 6 ఉట్టి | 5 | 23 | 25 చింతాడ | 4 | 20 |
| 7 ఏనుగుల | 10 | 40 | 26 చొక్కార | 8 | 24 |
| 8 ఏరాడ | 5 | 30 | 27 జగుపిళ్ల | 40 | 222 |
| 9 కరణం | 3 | 11 | 28 చీపుళ్ళ | 60 | 241 |
| 10 కసిశెట్టి | 19 | 96 | 29 తమ్మిన | 302 | 1233 |
| 11 కాముదిలి | | | 30 తొత్తడి | 23 | 87 |
| 12 కామందుల | 20 | 101 | 31 [illegible]టూరు | | |
| 13 కాటుపిళ్ళ | 16 | 64 | 32 దేవిన | | |
| 14 కంచుపిళ్ళ | 19 | 60 | 33 దుక్క | 70 | 380 |
| 15 కిలారు | 20 | 102 | 34 దురగాసి | 9 | 36 |
| 17 కూనిపిళ్ళ | 5 | 15 | 35 నాగోతి | 200 | 839 |
| 18 కొప్పరాతు | 9 | 36 | 36 నాగుపిళ్ళ | 20 | 60 |
| 19 కొరగంజి | 25 | 105 | 37 నెర్జి | 6 | 24 |
| 20. కొరికాని(ని) న | 22 | 72 | 38 పండు | | |

| యింటిపేరు. | కుటుంబములు. | జనాభా | యింటిపేరు. | కుటుంబములు. | జనాభా |
|---|---|---|---|---|---|
| 39 పాణుకు | 8 | 27 | 60 మడ్డు | 2 | 11 |
| 40 పట్లా (ల) స | 9 | 36 | 61 మాకె(కి)(న) | 39 | 196 |
| 41 పయిడి | 2 | 6 | 62 మల్లు(ల్ల,ల)కోతు | 7 | 35 |
| 42 పైల | 20 | 80 | 63 మసపిళ్ళ | 96 | 114 |
| 43 పైడిపోటి | 8 | 48 | 70 రాచపిళ్ళ | 6 | 18 |
| 44 పైడిపోతి | 6 | 30 | 71 రాయి (సి. ణి) | 60 | 243 |
| 45 పాగ్ల | 6 | 24 | 72 రాజగిరి | 36 | 146 |
| 46 పిళ్ళా | 366 | 1830 | 73 లండా | 12 | 48 |
| 47 పీస | 60 | 222 | 74 వడ్డాది | 3 | 16 |
| 48 పొట్నూకు | 96 | 384 | 75 వడాపెన | 9 | 33 |
| 49 పోతిన | 91 | 336 | 76 వజ్జి (రి) | 20 | 80 |
| 50 పోలిన | 4 | 46 | 77 వంద్రాసి | 28 | 152 |
| 51 పొట్రు | 1 | 3 | 64 మేడి | 8 | 42 |
| 52 బయపిళ్ళ | 30 | 90 | 65 ములంపాక | 6 | 26 |
| 53 బాయి(న) | 63 | 662 | 66 ముంజేటి | 7 | 36 |
| 54 బంక | 290 | 1223 | 67 ముదిలి(కొముదిలి) | 32 | 128 |
| 55 (బె)బెవ | 71 | 276 | 68 మంతిన | 1 | 4 |
| 56 బూరాడ | 26 | 109 | 69 రాంపిళ్ళ | 92 | 459 |
| 57 బోగాల(ళి)(లి) | 30 | 90 | 78 శార్న(శ్నే.టి) (నం) | 30 | 122 |
| 58 మగ్గూరు | 6 | 30 | | | |
| 59 మజ్జి(జ్జు)(జి) | 80 | 344 | | | |

| యింటిపేరు. | కుటుంబములు. | జనాభా |
|---|---|---|
| 79 శీరం (శీల. శీర) | 56 | 169 |
| 80 సింగుపిళ్ళ | 16 | 64 |
| 81 సత్యాల | 159 | 666 |
| 82 సగునుపిళ్ళ | 32 | 96 |
| 83 సంబాని | 9 | 32 |
| 84 సంచాని | | |
| 85 సంపదరావు | 16 | 64 |
| 86 సుఖవాసి (సుఖాసి) | 15 | 71 |
| 87 క్షీరం | 1 | 18 |

1936 సం॥ నేను సంపాదించగలిగిన జనాభాన్ని వక్కయింటి పేరువారు యెన్ని కుటుంబములు గలవు, యెందరు గుంపు అని వ్రాయుతలంపుతో నేను తెలుసుకొన్నంత వరకు ఇందు బొందు పరచితిని. యెన్నోసార్లు మన కులప్రముఖులను జనాభానుగురించి అడిగియుంటిని. ఈస్వల్ప విషయము వారికి తెలియకో, లేక నాకు చెప్పుటకు యిష్టములేకనో కాలము వ్యయబుచ్చిరి. సభలు చేయించవలసినదిగా కొన్నాళ్ళు కుల గాధలు తెలియచెప్పమని కొన్నాళ్ళు గోత్రములు యింటిపేర్లు యివ్వవలసినదిగా కొన్నాళ్ళు వంశవృక్షములు యివ్వమని కొన్నాళ్ళు, కాలుకు బలపముకట్టుకొని పెద్దలన్న వారిండ్లకు సంవత్సరాల తరబడి తిరిగితిని. నేను చేయుచున్న వృత్తి ప్రాణప్రదమైనఆయుర్వేదవృత్తి. నేనువ్రాయబూనిన గ్రంథము సంఘసమూహమునకు వజ్రకవచము. ఇట్టి నన్ను ఉపయోగించుకొనుమార్గము త్రిప్పటతప్ప ఉపకార మగపడదయ్యె. లక్షాధికారి యింటబుట్టి రాజహోదా లనుభవించిన కుటుంబీకుడనని గర్వమెరుగక తిరిగితిని. అట్టి మహానుభావులెవరో వారి హృద

యములకే తెలుసును. ఇప్పటికైనా మించలేదు. మీ మీ వంశవృక్షములు ఛాయాచిత్రరువులు, తమ పూర్వులనుండి ఈనాటివరకు తామొనరించి మహత్కార్యములు తెలియచేసిన అచిరకాలముననే గ్రంథమును చూడగలరుగాన పైవిధమున ముద్రించి పంపుటయో లేక ముద్రణకగు సొమ్మును పంపుటయో జరుపుదురను సదుద్దేశమే ఈగ్రంథముద్రిణము, కలముగలవారిని బలముగలవారు,కలిమిగలవారు ప్రోత్సాహించుటకు వేరుచెప్ప వలెనా? నాగ్రంథరచన అంతయు మిమ్ములనుగూర్చి గాదా? ఇదివరలో చెప్పినప్పుడీతను గోత్రములు, గృహనామములు తెలియచేసిన యిందు బొందుబరచనా, ఇహ ఆలశ్యముచేయక త్వరపడుడు, త్వరపడనివారు మూలమున లేరన్నలోపము మీదైయున్నదని గమనింపుడు. నేనిందు పనివాడనై యిల్లు కట్టితిని. ఆభవనమున ఆనంద మనుభవించుచూ సౌఖ్యజీవనము చేయువారు సంఘీయులు. ఈ నానిర్మిత భవనము రవితారాగణమున్నంతవరకు ఉండును. ఇందు నాశిల్పము ముందుయుగము వారికి తల్పము, అల్పుల కిది నాటనేట అల్పనే.

### నాగరాజులు బౌద్ధమత స్వీకారము:— సింహాళము.

సిద్ధార్థుడు బుద్ధుడైన, ఐదు సంవత్సరములకు మహోదరుడు, శూలోదరుడను నాగరాజప్రముఖులు ఇరువురు, వజ్రసింహాసనమునకై, పోరాడుచున్న సమయమున బుద్ధుడు అచ్చటకు పోయెను.

పంచశత యోజనముల విస్తీర్ణత గలిగి సర్వసంపదలకు నిలయమైన, నాగద్వీపము మహోదరుడు పాలించుచుండెను. సింహళ ద్వీపమునే నాగద్వీపమందురు.

మహోదరుని సోదరిని, (గంధమాదన) కొండను పాలించు నాగరాజునకిచ్చి వివాహముగావించెను. ఆ దంపతులకు జన్మించినవాడు రత్నసింహాసనముపై తనకు హక్కుగలదని వివాదము పెట్టుచుండెను.

బుద్ధుడు వారలకు హితోపదేశములు గావించి, వారినందరను, శిష్యులుగా స్వీకరించెను. కళ్యాణపురాధీశ్వరుడగు మేనమామకుకూడా బుద్ధుడు, మతదీక్ష నొసంగెను. అంత నాగరాజు లా రత్నసింహాసనమును బుద్ధ భగవానునకు సమర్పించి, వారందరు శిష్యులయిరి.

బుద్ధభగవాను డీ సింహాసన మధిష్టించి, ఆ నగరవాసులకు, మతోపదేశములు చేయుచు కొంత కాలమచ్చటనేయుండి మరల వచ్చునప్పుడు ఆ సింహాసనము నాగరాజులకే ప్రసాదించెను.

రాజాయతన వృక్షమచ్చట నాటి, ఓ ప్రియమైన నాగరాజులారా! నా యీ వృక్షమును పూజింపుడు. మీకు శాంతి సౌకర్యములు ప్రసాదించునని బుద్ధుడు పల్కెను. ఈ యుదంతము బౌద్ధమత గ్రంథములైన, మహా వంశము, రత్నాకరము రాజావళీగ్రంథ పరిశీలమువలన తెలియును. ఈ రాజయతన

వృక్షమును పూజించువారే ఈ నగరాల జాతియందు గల పాలాకు, రావాకు, మఱ్ఱాకు మొదలయిన వృక్ష సంబంధము లయిన గోత్రీకులు.

క్రీ. శకము రెండవ శతాబ్దమున, సింహళ ద్వీపము పాలించిన వారిలో మల్లనాగుడు, చండనాగుడు, శ్రీనాగుడు, అను నాగరాజ వంశక్షత్రియుల పేర్లు కనుపించుచున్నవి. క్రీస్తుకు పూర్వము నాల్గవ శతాబ్దమున చంద్రగుప్త చక్రవర్తి దక్షిణ దిగ్విజయయాత్రలో గణపతినాగుడు అను నాగరాజును జయించినట్లు చరిత్ర వలన తెలియు చున్నది.

## పీఠాధిపత్యము.

ఈనాగరాజులు, "ఈపోద్ఘాతాదిని నగరాలచరిత్ర త్రవ్వుటకుముందు శంకర, బౌద్ధ, జైన, రామానుజ మొదలైన వారి పూర్వ మతచరిత్ర సవిమర్శనముగా తెలిసికొనిసగాని మన పూర్వ ఆచార వ్యవహార నియమాలకు ఎట్లు దూరమైతిమో తెలుసుకొనలేము" అని దెల్పియున్నాను. ఆ విషయ నిర్ణయ మును యిందు పొందుపరచుచున్నాను.

ఈ నగరాలలో చాలా కుటుంబములవారు బౌద్ధ జైన మొదలయిన మతముల స్వీకరించి మత ప్రబోధకులుగా, మహాంతులుగా కూడ వున్నటుల దెలియుచున్నది. ఈ విష యము వారు ధరించిన గురుమహాంతులవారు, రామదేవువారు, శీలమువారు, సత్యాలవారు మొదలుగాగల ఇంటి పేర్లే

(గృహముల్లే) పైమతాదులయందు ప్రబల నిదర్శనములు. అందుచేతనే తొలుత మీరు స్వీకరించిన బౌద్ధ జైన మత, సిద్ధాంతాధిక్యత వెల్లడించుట యుప్రస్తుతముకాదు.

—: జ గ త్ గు రు వు :—

జగద్గురువైన బుద్ధభగవానుని నవీన మతా ధర్మము లను ఉపదేశించెడివారిని అనగా గురు మహాత్ములను తెలియ జేసెడివారనియు, గురుమూర్తులు అనియు గురుమహాంతు లనియు పిలిచెడివారు.

బుద్ధచక్రవర్తి తన అవసాన కాలమందు అష్టాంగ మా ర్గము తన శిష్యులలో నొకనికి ఉపదేశించెను. మరణించునప్పు డాయన శిష్యులతో పలికిన దేమనగా "పదార్థ సంయోగ జనితములయిన ఈ శరీరములకు వియోగము తప్పదు. ధర్మ కాయ మొకటియే శాశ్వతమైనది. జ్ఞానమును వెతకి స్వయం కృషివలన నిర్వాణంబు నొందుడు. ఇదియే ఆయన తుది వా క్యములు. ఈ అంత్యోపదేశము జరిగి ఇప్పటికి 2428 సంవ త్సరములు గతించెను. అనగా బుద్ధభగవాను డస్తమించి 1951 సం॥ నాటికి పైకాలమైనది.

—: బౌ ద్ధ ధ ర్మ ము లు :—

బౌద్ధ ధర్మమున ఆరు నిబంధనములున్నవి. ఒకటి దానము, రెండు శీలము, మూడు క్షాంతి, నాలుగు వీర, అయిదు ప్రజ్ఞ, ఆరు ధ్యానము.

ఇందు ''శీలము'' అనగా నీతి ప్రవర్తన. నీటిసే పుణ్య సంభారమందురు. ఇది కలుగనియెడల ప్రజ్ఞ పరిమితి అనగా జ్ఞానసంచారము సిద్ధింపనేరదు. కనుక ఈ ధర్మములలోకెల్ల ముఖ్యమైనది శీలము (నీతిప్రవర్తన) ముఖ్యాధారము. బౌద్ధ ధర్మఫలము దుఃఖవిముక్తియే కావున అట్టి దుఃఖ కారణములైన తన వాంఛలను విడువవలయును. మరియు అహం అనునది తృష్ణయందు వెల్లడిగా కనపట్టును కాబట్టి తృష్ణను విడచుట ప్రథమకార్యమగుచున్నది.

పాపకృత్యములు పది అపరాధములవలన కలుగుచున్నవి. ఇట్టి పాపకార్యములను దరిచేరకుండా చేయుటయే ''శీలము''. ఈ బుద్ధునిధర్మములకే ''శీలము'' అని పేరు. ఈ మతప్రవక్తలే మనలోగల శీరము, క్షీరము ''శీలము'' అను గృహానామము గలవారు.

''గౌతమీ గోత్రీకులు.'' ఈ గోత్రీకులు గౌతమముని శిష్యులు. వీరిలో చాలాభాగము దేవదత్తుని శిష్యులై యుండిరి. బుద్ధుని జ్ఞాతి వర్గీయులలో ''దేవదత్తుడు'' ఒకడు, క్రీ. పూ. 6, 7 శతాబ్దములయందు బౌద్ధమత ప్రచారము విరివిరిగా సాగినట్లుగా కన్పబడుచున్నది. బుద్ధుడే తనకు పూర్వము బుద్ధులను నామము కలవారు గలరని తన ప్రసంగములయందు సూచించుచూ వచ్చినాడు. ఈతఁడు క్రీ. పూ. 557 వ సం॥న జననమందినాడు. గౌతమ బుద్ధుఁడే బుద్ధమత నిర్మాతగాడు!

కాని స్వీయముగా కృషిజేసి ఈమతమును మిగుల అభివృద్ధి లోనికి దెచ్చినాడు. ఈగౌతముని శిష్యకోటిలోనివారే ఈనాడు గౌతమి గోత్రమును ధరించిన "పిళ్లా" మొదలగువారు.

## —: బౌద్ధ మతము :—

కోసల దేశమునకు ఈశాన్యముగా హిమాలయ ప్రాంతముల పశ్చిమమున గల నేపాళ దేశమున గౌతమ గోత్రీకులైన శాక్యవంశ క్షత్రియులు కపిలవస్తు నగరమును ముఖ్యపట్టణముగా చేసికొని పాలించుచుండిరి.

క్రీస్తు పూర్వము ఆరవ శతాబ్దిని ఈ రాజ్యమును శుద్ధోదనుడను రాజు పాలించుచుండెను. ఈతని పట్టమహిషి పేరు మహామాయ, చాలాకాలమువరకు ఈమెకు సంతానము లేక కొన్నాళ్లకు గర్భముదాల్చి నెలలు నిండిన వెనుక కపిల వస్తు నగరమునకు చేరువ గ్రామమున గల తన పుట్టినింటికి పురుడు పోసికొనుటకై పయనము గావించుచుండ మార్గమధ్యమందున గల సాలవనమునగల నొక సాలవృక్షచ్ఛాయని యించుక విశ్రాంతికై విడిసియుండెను. ఇంతలో నొప్పులు ప్రారంభమై వక మగశిశువు గలిగెను.

ఈతడు పుట్టిన యేడవ దినముననే ఈతని జనక తల్లియైన మహామాయ, స్వర్గము చేరెను. నాటనుండియు సవతి తల్లియైన మహాప్రజాపతి గౌతమియే పెంచి సిద్ధార్థుడను నామకరణము గావించి పెద్దవానిని చేసెను.

ఈతఁడు దిన దిన ప్రవర్ధమానుఁడగుచూ క్షత్రియోచిత ములైన రణవిద్యలయం దసమానుఁడో యన ప్రసిద్ధినహించెను.

ఈతఁడు యశోధరయను సుప్రబుద్ధుని కుమారైతస్వయం వరమందు యేర్పాటు చేసిన ధనుర్విద్యా పరీక్షయందు తన జోడి శాక్యరాజకుమారుల నెల్ల ఓడించి అసమాన రూప లావణ్య గుణశీలవతియగు సుందరిని చేపట్టెను. అప్పటికి బుద్ధుని వయస్సు పదియారేఁడులు—ఈతనికి ఇరువదితొమ్మిదవ యేట రాజ్యము త్యజించి యిల్లు బయలు దేరవలెనను తలంపు కలు గుటయు ఆనాఁడే తన భార్య ప్రసవించుటయు గలిగినది. ఆ దినము అర్ధరాత్రియందే పురిటి గదిలోని కేగి కుమారుని చూచి ముద్దయినను పెట్టుకొనక పురమును వీడెను. ఈతని కుమారునకు రాహులుఁడను నామకరణము చేసిరి. యిల్లు వదలి దేశ ద్రిమ్మరిగా తిరిగి తిరిగి మగధకు రాజధానియైన (రాజ గృహము) రాజగిరికి చేరుకొనెను. నాగ మతమందు గల ప్రసిద్ధ గురుమహాంతులవద్ద శుశ్రూష చేసి తనివిదీరక తపో నిమగ్నుఁడై శల్యావశిష్టుఁడైనను తృప్తినందక మరల భిక్షాటనము నకై పయనము సలిపి బుద్ధగయకు సమీపమున గల యురువెలా గ్రామమున గల పరిసరారణ్యమున ఒక అశ్వత్థ వృక్షఛాయను వశియించి, జ్ఞాన సమాధియను దీక్ష బూనెను. కొన్నాళ్ళ కీ సిద్ధార్థుఁడు సిద్ధిపొంది బుద్ధుఁడయ్యెను—ఈతనికి స్వయముగా బోధలు చేయవలయునను తలంపుగలిగి కాశీ పట్టణమునకు ఆరుమైళ్ళ దూరమందుగల మృగధావనము చేరుకొని మొట్ట

మొదట బుద్ధ ధర్మ బోధనలు ప్రారంభించెను. ఈ మృగధావనమునకే ఇప్పుడు "సారంగనాథము" లేక సార్నాథ్ అని పేరు. బుద్ధుని ధర్మప్రబోధ గ్రంథముల, ''ధర్మచక్రవర్తన'' మని పేరు నాగరాజులలో ప్రచారకులైన చక్రవర్తివారికి, చక్రప్రవర్తనలోగల తృతీయాక్షరము లోపించి ఉచ్చాటనలో చక్రవర్తి లేక చక్రాతి అని స్థిరమైనది. బుద్ధ భగవానుని యొక్క తుది వాక్కుల రహస్యమంతయు నాలుగు మహా సత్యవాక్కులయం దిమిడియున్నదని నుడివెను.

1. పుట్టుటయే దుఃఖము బ్రతుకుటయే దుఃఖము సర్వము దుఃఖము.

2. దుఃఖసముత్పాదకము తృష్ణ అనగా కోరికలవలన దుఃఖము, సంభవించుచున్నది. జీవింపవలెను,సంపాదించవలెను. అనుభవించవలెను. అను కోరికలన్నియు దుఃఖకారకములే.

3. ఆశ విడిచి కోరిక తగ్గిన దుఃఖనిరోధము గలుగును. ఇదియే నిర్వాణము.

4. దుఃఖ నిరోధనకు మార్గము చూపునది ఈ అష్టాంగ మార్గమే.

వీటికే చతురార్య సత్యములని పేరు. ఈ ధర్మ ప్రచారములు గావించి జన్మరాహిత్యమార్గ మవలంబించి బోధించిన వారే 'సత్యాలవారని' పిలుపబడుచుండిరి. బుద్ధుడుపదేశించిన అష్టాంగ మార్గములకు శీలము అని పేరు. ఈ అష్టాంగమార్గ

మెరిగి ఉపదేశించినవారే శీలము సీరము, క్షీరము, అని పిలువంబడుచున్నారు.

(1) వినయపిటకము, (2) సుత్తపిటకము, (3) అభిధర్మపిటకము వీటియందు మొదటిదగు వినయ పిటకమునందు బౌద్ధభిక్షు వుపదేశించవలసిన విధులు జీవనము గడపవలసిన విధానములు ఉండును. ఈ వినయపిటక ధర్మమార్గ ప్రబోధకులే గుఱుమహంతు, శీలము, సత్యాల, సంపదరావు, సుఖవాసి, శార్న, రామదేవు, మల్లురౌతు, మజ్జి, మాకెన, చక్రవర్తి, పిళ్లా, మొదలైన కుటుంబములు.

(2) సుత్తపిటకము బుద్ధుని ధర్మోపదేశ బోధనలను దెలుపును. సమక్చరితము (1) అహింస, (2) సత్యము, (3) అస్తేయము, అనగా దొంగతనము చేయకుండుట (4) బ్రహ్మచర్యము, (5) అపరిగ్రహము, అను ఈపంచమహావ్రతము ప్రధానము. ఈమహావ్రతములను దీక్షగా పూనినవారే ఈమహామతమునకు పాత్రులనియు మహాపాత్రులనియు బిరుదుగలినవారు.

(3) అభిధర్మ పిటకము బౌద్ధుల వేదాంతమునుగూర్చి తెలుపును. ఈ త్రిపిటికల ప్రచార ప్రసిద్ధులే పిటకనోనెపాళెం కాపురస్థులు.

—: పరిషత్తు సభలు :—

| | | | |
|---|---|---|---|
| పరిషత్తు:— | 1, | క్రీ॥ పూ॥ | 477 సం॥ |
| ,, | 2. | ,, | 377 సం॥ |
| ,, | 3. | ,, | 242 సం॥ |

అశోక చక్రవర్తియొక్క మూడవ పాలనకు పూర్వమే అనేకమంది ధర్మోపదేశకుల రాజ్యములకు పంపినటుల తెలియుచున్నది. అనగా క్రీస్తు పూర్వము 477 కాలమందు ద్వితీయ పరిషత్తు 377 న జరిగినది కాని ఆరు మాసములవరకు అంత శ్రద్ధగా ఉన్నటులీ పరిషత్తున శోచదు. మూడవ పరిషత్తు ఉత్సాహముగా దేశదేశములకు మతబోధకులను బంపినటు లున్నా అనగా బుద్ధుని మరణానంతరము 236 సంవత్సరము నకు క్రీ॥ పూ॥ 242 సం॥ లో మూడవపరిషత్తు జరిగెను.

క్రీస్తుశకము 40 సం॥ రమున భరతఖండోత్తర భాగ మందు కనిష్క చక్రవర్తి కాలమం దొకటి జరిగినటుల చైనా గ్రంథముల వలన తెలియుచున్నవి. అశోకుని శాసనములలో ప్రథమ శాసనము గిరినగరమందు కనిపెట్టబడినది. ఇది కతియ వార్ (KATHIAWARH) పట్టణమునకు తూర్పున గిరినగర పర్వతములయందున్న నల్ల రాతిబండమీద చెక్కబడినది. ఇది బంగాళా తీరమందు కలదు.

—: గౌతమ గోత్రికులు :—

గౌతమగణము, ఇది ఆంగీరససంతతిలోని యొకగణము. ఇందు ఆయాశ్య, శరద్వంత, కౌమండ, దీర్ఘతమస, ఔశనస, కారేణుపాలి, రాహూగణ, సోమరాజక, వామదేవ, బృహదుక్థ, ఔతథ్య, ఔసిజ, కాక్షీవత, రాఘున ఈ పదునాలుగు ఆంగీరస

సంతతిలోని ఒకగణము. గౌతములనేకులు గలరు. అహల్యా భర్తయు శతానందునకు తండ్రియు కృపాచారుని పితామహుడగు గౌతముఁడు ఈతడే మహాఋషులందు పరిగణింపబడిన వాఁడు. వేరొకగౌతమునకు నక్షపాదగౌతముఁడని పేరు. ఈతడు తర్కశాస్త్రమునకు సూత్రకర్త. మహర్షి గౌతముఁడు దేంవేంద్రుని, అహల్యను శపించినవాఁడొకఁడు.

సత్రయాగ మొనరించిన వాఁడొకఁడు. తపంబొనరించి శివజటాజూటమునందున్న గంగను భూమిగతం జేసి గౌతమి (గోదావరి) నదిం దెచ్చినవాఁడొకఁడు. ఈతని నివాసాశ్రమ స్థళము బొంబై రాజధాని నాశికకడనున్న త్రియంబక క్షేత్రము. అచ్చట ఈతడు ప్రతిష్ఠించిన శివలింగము గలదు.

కుమారుఁడు, శతానందుఁడు, గౌతముఁడు జనక మహారాజునకు పురోహితులు. ఇంకను కణాదునకును బుద్ధ భగవానునకును గూడా గౌతమనామములు గలవు.

గౌతమమహర్షి గోత్రము – ఈ గోత్రమువారికి ప్రధాన ఋషులు ఆంగీరసుడు గౌతముఁడు అనియు; ప్రవరః– ఆంగీరస, ఆయాస్య, గౌతమ, త్రయార్షేయ అని తెలియుచున్నది. వివరములకు మూలగ్రంథము చూడుఁ.

## కూర్మ గోత్రము.

కూర్మాచలదేశము – ఇప్పుడు కుమాన్ డివిజను లేక కాళీ కుమాన్ అని పిలువబడుచున్నది. సంయుక్త రాష్ట్రము

లలోని ఆలో్న్డికచేరినది హిమన్నగము పైనున్న దేశము. దీనికి చంపావతీపురము రాజధానియై యున్నది. అట నొక పర్వతముపై క్రాంతేశ్వర శివలింగము, హింగుళాదేవి దేవస్థానమును గలవట. అచ్చట వక చిన్న పల్లమున రాతి తాంబేలు గలదు. అది కూర్మావతార స్థలమందురు. దానినుండియే ఆ పర్వత పంక్తికి కూర్మాచలమని పేరయ్యెనట. బాణాసురుని కుమార్తెయైన చంపావతి ఇటనే సిద్ధురాలగుటచే నాపేరే ఈ తావునకు కలిగెనట. అప్పటినుండియు అది చంపావతీ పుణ్యక్షేత్రము. దీనిని దేవతానివాస భూమి యనెదరు.

అచ్చట అసురకాలము నాటి శిలాదుర్గమును వారిచే పూజింపబడెడి భగవతి ఆలయమును గలవు. అత్తావునకు పూర్వము శోణితపురమని పేరట. ఇప్పుడు సూయీూ అని పిలుచుచున్నారు. ఈ దేశ మొకప్పుడు అరుణోద దేశమునకు జేరియుండెనట.

(శ్రీ) కూర్మ, కూర్మ, కూర్మాల, తాబేలు మొదలయిన గోత్రీకులకు పూజనీయమైన దైవము ఈ తాంబేలే అని గ్రహింతురుగాక. తాంబేలు అన్ననూ కూర్మము అన్నను వకటే. ఇంకను వివరములు మూలగ్రంథమందు చూడుడు.

కాలము చేయరాని మార్పులు లేవుగదా! సముద్రములు భూ ప్రదేశములగును. భూములు జలార్ణవములగును. వచ్చెను అన్నది వ్యాకరణ మగును. వచ్చాఁడు, వచ్చినాఁడు వచ్చిఁడు, వస్తుఁడు మున్నగునవి యపభ్రంశంబులగును.

ఒక నాణెము వెల మూడు దమ్మిడీలు. దానిని ఒక యూరువారు కానీయనియు, మరియొక ఊరివారు డబ్బు యనియు, వేరొకచోట పైసా అనియు, ఇంకొకచోట బొట్టు అనియు, కొండొక తావున కాలణా అనియు పిలుచుట చెవులార వినుచున్నాము. ఇట్లే దేశకాలాదులనుబట్టి భాష మారుచుండుట లోకవిదితమే. కాని, తత్వజ్ఞులు ఐక్యతను కనిపెట్టి మారిపోయిన లేక చెదరిపోయిన ప్రత్యేక వ్యక్తిత్వము దాల్చినవాటి పూర్వరూపమును కనిపెట్టి ప్రదర్శించెదరు. అట్టి ప్రాచీన సాంప్రదాయ రూప పటమును చూపులో నుంచుకొని విశిష్టాచారములు భాషా సాంప్రదాయములు ఆచార వ్యవహారాల మార్గాలద్వారా అన్వేషించుతారు. అందులకై ఈపైన కొన్ని గోత్రములు యిచ్చి వాటి వాటి పూర్వ రూపమును బహిరంగపరచితిని. ఇట్లే మతము, గోత్రము, కులము, బిరుదము, దేశములు అత్యంతవసరములు. ఇందు తాబేలు గోత్రీకులు వారు తాంబేలును చంపరు, తినరు. ఇట్లే దేవతానామములు, సర్ప నామములు, వృక్షనామములు, ఆయా గోత్రీకులకు పూజనీయములు అయి విరాజిల్లుచుండెను. ఇట్టి దేవతానామములు సంఘములను సూచించును. అట్టి సంఘములు దేశాంతరముల నివసించినప్పుడు తమకంటే ప్రబలమగు శాఖలలో లీనమైపోవును కాని తమ దేవతా సాంప్రదాయమును విడువరు. ఆ శాఖలలోని అంతశ్శాఖలతో వివాహమాడరు. వారితో భుజింపరు. వివాహాదులయందు ప్రత్యేక ఆచారము గలిగియుందురు.

## —: బౌద్ధుల గాథలు :—

సింహళద్వీపమునందు చెప్పఁబడు బౌద్ధుల గాథలలో నాంధ్రదేశము నాగులదేశముగా చెప్పఁబడినట్లుగ గన్పట్టు చున్నది. గంగానదీ ముఖద్వారమునకును సింహళద్వీపమున కును నడుమ నాగులచే నివసింపబడు దేశముకలదు. ఈనాగులు బుద్ధునియొక్క బొమికలను రెండు ద్రోణముల సంపాదించి వానిని వజ్రాలదిన్నకడ (Diamonds Sands) పాతిపెట్టి పైన నందమయినట్టియు, అమూల్యమైనట్టియు, స్థూపము నొక దానిని నిర్మించిరని చెప్పబడినది. ఈ బొమికలభాగము మొట్ట మొదట కపిలవస్తునగర సమీపమునందలి రామగ్రామము లోనిది. రామగ్రామములోని స్థూపము వఱదకు కొట్టుకొని పోబడినప్పుడీ బొమికలపెట్టె గంగానదిలోబడి కొట్టుకొనిపోయి సముద్రములో బడగా నాగరాజులు దానిని బట్టుకొని మంజీర కాయను తమదేశమునకు కొనిపోయిరి. ఈరామగ్రామ వాస్త వ్యులయిన పిళ్లావారే రాంపిళ్ల యని పిలువబడుచున్నారట. ఈ మంజీరకాదేశము కళింగదేశమునకు రాజధానియగు దంతి పురమునకు దక్షిణమువనున్నది. ఎందుకన రాజపుత్రుఁడగు దంతకుమారుఁడును, రాజపుత్రికయగు హేమాచలయు బుద్ధుని దంతముతో నోడనెక్కి దంతపురమునుండి సింహళద్వీపమునకు పారిపోవునప్పుడు వజ్రాలదిన్నె (Diamonds sands) యను నది యాప్రదేశమే యగుననియు యూహింపబడుచున్నది. ఈ దంతపురకథనము క్రీ. శ॥ నాలుగవ శతాబ్దారంభమున జరి

గియుండెనని సయామువేశ గ్రంథమువలన గన్పట్టుచున్నది కాని మహావంశమునందు క్రీ॥ పూ॥ నూటయేబదియేండ్ల క్రిందట జరిగినట్లుగ చెప్పబడుచున్నది. తరువాత సింహళరాజు * మంజీరకా దేశమునకు బోయి యా బొమికలపెట్టె దెమ్మని పరిశుద్ధుండైన మతాచార్యుని నొక్కని బంపెను. ఇయ్యది నాగులకు అంతగా యిష్టము లేకపోయినను నత్యద్భుతముగా అది యెట్లో యా మతాచార్యుని వశమయ్యెను. ఈ నాగరాజునకు కొన్ని బొమికలిచ్చి సంతోషపెట్టెను. బుద్ధభగవానుని బొమికెల పెట్టెను గోడపైనుండి అమరావతికి దెచ్చి జాగ్రత్తగ కాపాడినవారే వాడసవారైరి.

## బుద్ధుని దంత కథనము

బుద్ధుని దంతమును గూర్చిన కథలు పెక్కులు గలవు. గాని వానిలో రెండు ముఖ్యములయినవిగా గన్పట్టుచున్నవి. అందు మొదటి గాథ యిట్లు చెప్పబడుచున్నది.

బుద్ధుని యెడమ పార్శ్వమునందలి దంతము కళింగదేశమునకు రాజధానియగు దంతపురమునందు బహుశః ఇప్పటి జగన్నాథము అనబడు ప్రదేశమున నెన్మిదివందల సంవత్సరములవరకు సురక్షితముగా నుంచబడియెను. క్రీస్తుశకము నాలు

* యీ మంజీరకాదేశమె మంజీరదేశమని బౌద్ధులచేతను ఆంధ్రదేశమున యార్యులచేతను ఆ కాలమున బిలువబడుచు వచ్చెను. మంజీరకయను యుపనది యొక్కటి గోదావరిలో కలియుచున్నది.

Major General Acunning Hanmmam's Ancient of India. P. 534.

గవ శతాబ్ద ప్రారంభమునందు గుహశివుడను రాజు తానప్పటి వరకు నవలంభించి యుండిన బ్రాహ్మణ మతమును విడిచిపెట్టి బౌద్ధమతము నవలంభించెను. క్రొత్త మతమవలంభించిన పట్టు దలచేత నాతఁడు తన్నాశ్రయించుకొని యున్న బ్రాహ్మణులను తొలగించి వారల బాధపెట్టనారంభించెను. వారలు పాటలీ పుత్రమునకు పోయి రాజాధిరాజగు పాండునకు చెప్పి మొఱ పెట్టుకొనగా నాతఁడు గుహశివుని దంతముతోఁగూడ దన కొల్వు కూటమునకు రావలసినదిగా నుత్తరువు చేసెను. ఆ యుత్తరువు ప్రకారము వచ్చినమీదట దంతమును సర్వ విధ ముల భంగము చేయుటకు ప్రయత్నము జరుపబడి తుదకు దంతమునకే విజయము కలిగెను, అంతట ఆ పాండురాజు దంత మహాత్యమున కచ్చెరువంది తుట్టతుదకు దానే బుద్ధ ధర్మమవ లంబించెను.

ఇతడే గౌతమి పుత్ర యజ్ఞ (శ్రీ) శాతకర్ణి కావచ్చు నని డాక్టరు ఫెర్గ్యూసన్ గారు తలంచుచున్నారు కాని వారి అభిప్రాయము సరియైనది కాదని తోఁచుచున్నది.

ఇదంతయు జరుగుచుండగా క్షీరధరుడను నుత్తర దేశపు రాజొకఁడామహిమగల దంతమును బడయుటకై పాటలీపుత్ర ముపై దండెత్తివచ్చెను. కాని యచ్చట యుద్ధములో నాతడు మృతిచెందెను. అంతట గుహశివుడు దంతముతో రాజధానికి మరలివచ్చెను. కొంతకాలమునకు క్షీరధరుని సోదరపుత్రులు మరికొందరు రాజులను తోడుచేసుకొని గుహశివునిపైకి దాడి

వెడలి వచ్చిరి. వారల నెదుర్కొనుట సాధ్యముగాక గుహశివు డాత్మరక్షణార్థమై చూచుకొనసాగెను. యుద్ధము చేయుటకు ముందు తనకుమార్తెయగు హేమాచలను ఉజ్జయినీ పురాధీశ్వరుని కుమారుఁడును తన కల్లుఁడగు దంతకుమారుని, నుభయులను రప్పించి తానోడినయెడల నాదంతమును దీసికొని తప్పించుకొనిపోయి సముద్రమార్గమున సింహళద్వీపమునకు జేరి యాద్వీపము నేలుచుండి మహాసేనున కిచ్చివేయవలసినదని చెప్పెను. అట్లు దంతపురము శత్రువశమగుటకు పూర్వమే దంతకుమారుఁడును హేమాచలయు నాదంతమును యిసుకలో పూడ్చిపెట్టి పట్టణము విడిచి పారిపోయి తరువాత మరలవచ్చి హేమాచల యాదంతమును వేణియందు(జడ) దాచుకొని భర్తతోగూడ తామ్రలిప్త నగరమునకుపోయి యా రాజదంపతు లిద్దరు నోడ నెక్కి సింహళ ద్వీపమునకు ప్రయాణము సలిపిరి. ఓడనెక్కిన ప్రదేశమునకును సింహళమునకు నడుమ వజ్రాల దిన్నె (Diamonds sands) సమీపమున వారెక్కిన యోడ మెట్ట యెక్కెను. ఈ వజ్రాలదిన్నె (Diamonds sands) నడుమ నున్నదని చెప్పుటచేతను తీరమునకు సమీపముగా వజ్రములుండు ప్రదేశమిదియే యగుట చేతను కృష్ణానదీతీరమొ (ధాన్య కటకతీరమొ) యోడ మెట్ట పట్టిన స్థలమని డాక్టరు "ఫెర్గూసను" గారు ధృఢముగా విశ్వసించుచున్నారు. రాజకుమారియగు హేమాచల నిద్రబోవుచుండగా నాగరాజు దంతమును తస్కరించెనుకాని హిమాచలమునుండి వచ్చిన

---

Dr. Fergusson's Tree & Serpant worship P. 157-8.

యొక దేవత యొక్క మాంత్రిక శక్తిచేత నాగరాజు మరల దానిని నా రాజదంపతులకే యీయవలసిన వాడయ్యెను. ఆ రాజ దంపతులు తరువాత నోడ నెక్కి సింహాళమునకు పోయిరి. ఇది క్రీ. త॥ 312 సం వ॥ జరిగినది. వీరు సింహాళము చేరునప్పటికి తొమ్మిది సంవత్సరములకు పూర్వమే మహా సేనుడు మృతినొంది యుండెను. అయిన అప్పుడు రాజ్యము యేలుచుండిన మేఘవర్ణుడు వారలను సగౌరవముగా నాదరించి యాదంతముపైన నిటుకతోను సున్నముతోను ఒక చైతన్యమును నిర్మించి మహోత్సవము సలిపెను. మూడు సంవత్సరములు గడ చిన తరువాత నా లంకాధిపతి నాడు మొదలుకొని యేడు సంవత్సరములలో వజ్రాలదిన్నె మీద (Diamonds sands) ధర్మాశోకుడను రాజు దేవాలయము నిర్మించునని పూర్వమొక జ్యోసుడు చెప్పిన దానిం చూచెను. మఱియును బుద్ధుని బొమి కలు రెండు ద్రోణములింకను నాగరాజు దేశములో దాచబడి యున్నవను బొమికల పెట్టెను సంగ్రహించుకొని మేరూ పర్వ తమునకు పారిపోయెను. కాని బొమికెలు వానినుండి గైకొనబడి మరల దీసికొని రాబడినది. అంతట నాగరాజు మనోహర యావ్వనాంగుడై సింహాళమునకు వచ్చిన మేఘవర్ణునకు ప్రత్య క్షముకాగా నాతఁడు కొన్ని బొమికల నొసంగెను. తక్కిన బొమికల నొక సువర్ణ పాత్రమునందుంచి మూరెడు పొడువును జానెడు వెడల్పును గల యొక బంగారు పడవను నిర్మించి యా సువర్ణ పాత్రమునందుంచెను. అటుపిమ్మట నేడు

మూళ్ల దూలము వెడల్పు మాత్రమే కలిగియుండు కొయ్య పడవ నొకదానిని నిర్మించి యీ బంగారు పడవసందుంచి కొందరు రాయబారులతో దంతకుమారుని హేమమాలను వారికోరికను మన్నించి వారిదేశమునకు పంపించెను. వీరు బయలుదేరి ఐదుమాసములకు వజ్రాల దిన్నెను (Diamonds sands) చేరి యచ్చట దిగి బౌద్ధ మిక్షులుండు ప్రదేశమును దేవాలయమును చూచుకొని మరల పడవ నెక్కి మూడు మాసములకు దంతిపురమునకు పోయిరి. దంతిపురమున మేఘవర్ణుని రాయబారు లర్హప్రకారము సన్మానింపబడిరి.

మూడవగాథ మరియొకటి గలదు. "కర్నల్ టాడ్" గారది మరియొక రాజును గూర్చిన దనియు వేరు విషయముల గూర్చినదనియు దలంచుచుండిరి గాని కథా సందర్భమునుబట్టి యొక్కనిగూర్చియే యని కన్పట్టుచున్నది. ధర్మాశోకుడను రాజు మిక్కిలి న్యాయ బుద్ధితో నరవాడిదేశమును (అవంతి కావచ్చు) పాలించుచుండి క్షామోపద్రవములవలన ముప్పదిఒక వేలమంది దారిద్ర్యవంతులయిన మనుజులతో దక్షిణదిశకు నేడు నెలలు ప్రయాణముచేసి తుదకు జలమును మత్స్యములును సమృద్ధిగానున్న దేశమునకు వచ్చిరి. మరుచటినాటి వేకువను నశ్వారూఢుడై రాజు వజ్రాలదిన్నెను (Diamonds sands) ప్రవేశించి యచ్చట నాగరాజును గలిసికొనెను. ఆప్రదేశము నందొక చైతన్యము నిర్మించి యొకనగరము గట్టించెను. ధర్మాశోకుడు నెమ్మదిగ నిచ్చట, నేడేండ్లు రాజ్యపాలనము చేసెను.

కాని బుద్ధుని బొమికలు దొరకనందున సౌఖ్యములేనివాడై వానింకని పెట్టి తెచ్చినవారికి గొప్పబహుమానము చేసెదనని ప్రకటించెను. కాని ఏమియు ప్రయోజనకారి కాకపోయెను. ఇంతలో రోమురాజు పుత్రుడు కాకభాషియనువాడు తక్షశిలా నగరమునకు వర్తకమునకై యోడనెక్కి యైదువందల పరివారముతో వచ్చుచు తుపానుబట్టి దైవానుగ్రహము వలన నపాయమునుండి విడివడి తుదకు కష్టముతో వజ్రాలదిన్నె సమీపమునకువచ్చి జనులుండు సూచనలు కనిబెట్టి చూడవలెననెడి తలంపుతో నచ్చట నోడనిలిపి లంగరుదించెను.

## —: గా థ ల సా రాం శ ము :—

నాలుగవ శతాబ్ద ప్రారంభమున బుద్ధుని దంతమును గూర్చి ఇండియాలో బుట్టిన కల్లోలముల దెలిపెడి బౌద్ధుల గాథల నెన్నియేని తెలుపవచ్చును. బౌద్ధులగాథలు (Diamonds Sands) వజ్రాలదిన్నె గూర్చి ముచ్చటించుచున్నవి. కృష్ణాతీరమునందు దేవాలయము కట్టుకొన నిశ్చయించి నాగరాజచ్చట నివసించియుండెను. ఎన్ని విధములచేత చూచినను ఆప్రదేశ మిప్పటి యమరావతి (ధరణికోట) కావలయునుగాని మరియొక ప్రదేశము కాజాలదు. వీనినన్నిటినిబట్టిచూడగా నా గాథలలో నుదహరింపబడిన కట్టడము "అమరావతి స్థూపము" అని నిశ్చయముగా చెప్పవచ్చును.

ఈ దంత గాథ అంతయు మన నగర కులజులకు, అన్వయమై యున్నది అని తెలుపుటకు తమకు వక ప్రత్యక్ష

అనుశ్రుత ఆచారమును జ్ఞాపక పరచుచున్నాను. శివరాత్రి దినమున తమ కులదేవతలను స్మరింపజేయు వంశచిహ్నమైన నాగబెత్తము, బుద్ధమతస్థులమని దెలుపు తాటియాకుల పెట్టె (దంతముండెడిది) జైన మతమును ప్రచారించు, మహావీరుని (యూరుడు,) పండుగ.

అమరావతి స్థూపమును చక్కగా పరిశోధించితి మేని అందు నాగరాజు (నాగులు) లెట్లు ప్రదర్శింపబడిరో ఈ పైగాథలలోని వృత్తాంతముల చిత్తరువుల మూలమున నెట్లు తెలుపబడియెనో మనకు గోచరముగాక మానదు. దానింబట్టియే నాగరాజులచే పరిపాలింపబడెనని స్పష్టముగ చెప్పవచ్చును. ఇద్దరు మనుష్యులు బుద్ధుని బొమికలు పట్టుకొని పడవ టాపు మీద నిలుచుండి యొడ్డునకు వచ్చుచుండగా నాగరాజొకడు వారికి స్వాగతమీయ వచ్చుచున్నట్లను నొక చిత్తరువు చిత్రింపబడియున్నది. ఇంకను నాగరాజులకును రాజకుమారికతో నుండిన రాజ కుమారునికి గలిగిన సమావేశములను దెలిపిన రీతులు గల చిత్తరువు లనేకములు చిత్రింపబడియున్నవి. అమరావతి ధరణికోట (ధాన్యకటము) నాగరాజునకు రాజధానిగ నుండెనని యీ చిత్తరువులు ముఖ్యముగా దెల్పుచున్నవి. ఈ చిత్తరువులలోని నాగరాజుల కేడేసి పడగలు గల పాములు శిరమునకు వెనకప్రక్క యుండి యున్నవి. ఇట్లే రాణులకు మూడేసి పడగలు గల పాము లుండియున్నవి. ఇతర నాగులకు నొక్క పడగమాత్రమేగల పాములుండియున్నవి.

(ఆంధ్రదేశ కథా సంగ్రహము 5 వ ప్రకరణము పేజి 62-68 చూడుడు.)

—; బౌద్ధధర్మములు :—

(1) ధ్యానము, (2) శీలము, (3) వీర, (4) ప్రజ్ఞ (5) ధ్యానము.

ఇందు శీలము అనగా నీతిప్రవర్తన దీనినే బౌద్ధులు పుణ్యసంభారమనియెదరు. ఇదికలుగని యెడల ప్రజాసరిమి అనగాజ్ఞాన సంచారముసిద్ధింప నేరదు కనుక ఈధర్మములలో కెల్ల ముఖ్యమైనది శీలము. (నీతిప్రవర్తన)

బౌద్ధమత మిప్పటికి, 2550 సంవత్సరముల క్రితమున ప్రారంభింపబడి, క్రీస్తు తదుపరి ఏడు శతాబ్దములవరకు దేశదేశములయందు గురుస్థాన మలంకరించి, అఖండ విజయవంతముగా యితర మత విఘ్నములు లేకుండా మూడువంద లేండ్లు రుుంరుూఘూయుత్తమయ్యెను.

బుద్ధుడు 35 ఏండ్ల ప్రాయముననే రాజ్యము త్యజించి సన్యసించెను. ఇతని ప్రచారము క్రీస్తునకు పూర్వము 528 మొదలు 473 వరకు జరిగెను.

ఇతడు 80 సంవత్సరములు జీవించి క్రీస్తు పూర్వము (473) లేక 573 నిర్యాణ మందెను.

ఇదే సమయమున, జైనమత విజృంభణ కలిగినది. 555 సం॥ వైశాలిపురమునందు, క్షత్రియ కుటుంబమున మహావీరుడు జననమంది, బుద్ధునివలెనే 30 వ యేటనే సర్వసంగ పరిత్యాగముచేసి, క్రొత్తగా జైనమతమును, స్థాపించెను. 40 ఏండ్లు

ఈయన స్వయముగా మతబోధలుగావించి, ధర్మోపదేశము లుచేసి, క్రీ॥ పూ॥ 490 సం॥ స్వర్గముచేరెను.

వీరి మతమున, తీర్థంకరులును, గురువులును, గురు మహాంతులను దైవములకన్నా, నెక్కుడుగా భావించి వారి ప్రతిమలను పూజించుట, వీరి ఆచారములో ఒకటి. ఈ మహావీరుని మతానలంబకులే, మన నగరాలలో, మహాశివరాత్రి దినమున మహావీర (ఈరుడు) పూజ చేయు వారు.

## — జైనమతము :—

ఆర్య అనార్య లోకులై ఒకరిమతమును మరియొకరు స్వీకరించి యజ్ఞయాగాది క్రతువులలోను పశుబలులు నరబలు లతో రాళ్లకు, రప్పలకు, గట్లకు, చెట్లకు, సర్పములకు పూజల నొనరించుచు అగాధ అంధకారమం దుండిరి. క్రీ॥ పూ॥ 6, 7 శతాబ్దములయందు వేదమతము అనుపేరుతో వైదిక వాఙ్మయ మభివృద్ధిగాంచి చాతుర్వర్ణ్య వ్యవస్థను బలపరచి బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్యులను ఈ ఆర్యజాతి ఆధిక్యమంది ఆదిమజాతిగా నున్న వారిని శూద్రజాతిగాజేర్చి తమ ధర్మములను ప్రబోధించి బలపడు సమయమందు బుద్ధదేవుడు, మహావీరుడు మనకు మార్గదర్శకులై అవతరించిరి.

మహావీరునకు పూర్వము 23 తీర్థంకరులు గతించిరని చెప్పుదురు. ఏదిఏటులున్నను జైనమత ప్రచారకుడు మహా

వీరుడే. తీర్థంకరులు అనగా తీర్థము (రేవు) మనము మన జైన మత సాంప్రదాయానుసారము వీరుని ఉత్సవములలో నీళ్ళాట రేవుల కేగుట నేటికిని సాంప్రదాయము.

క్రీ॥ పూ॥ ఆరవ శతాబ్దాదిని గణరాజ్యముగా (నాయక సత్తాక)యుండిన విదేహకులకు వైశాలీ నగరము రాజధాని. ఈ రాజ్యము పరిపాలించుచుండిన నాయకులలో చేతకుడు ఒకడు. "త్రిశర"యను సోదరియు "చెల్లన" అను కూతురును గలరు. అతడు తన కూతురును మగధ రాజ్యాధిపతియైన బింబిసారునకు, "త్రిశల"యను తన చెల్లెలిని వైశాలినగర సమీపమున గల "కుండ" గ్రామమున నివసించుచుండిన నొక సామంత రాజైన సిద్ధార్థునకు నిచ్చి పరిణయమొనర్చెను. ఈ త్రిశల సిద్ధార్థులకు "నందివర్ధన" "వర్ధమాను"లను ఇద్దరు కుమారులును, "సుదర్శిని"యను నొకకుమార్తెయుగలిగిరి. సిద్ధార్థుని ద్వితీయ పుత్రుడైన వర్ధమానుడే యీ జైన మత స్థాపకుడు. జినుని మతమే జైనమతమందురు. జినుడనగా జయించినవాడు. మహావీరుడనగా ఆధ్యాత్మిక విజయమునందినవాడు, సమస్తము దెలిసినవాడు అను పేరున ప్రసిద్ధుడయ్యెను.

మన నగరాలలో జైన మతావలంబకులైన పూర్వ కుటుంబములు జాతులు మాత్రము మహాశివరాత్రి రోజు పవిత్రమైన పర్వదినముగా దలచి తమ మహోద్ధారకుడైన మహావీరుని మూలకుదెచ్చి నాగబెత్తము ఈరుడు (వీరుడు) పెట్టెను. మేళ, తాళ, వీరంగములతో మహా నదు లందామత చిహ్న

ములను స్నానమాడించి మూలనుంచి పూజింతురు. దీనినే మనము ఈరుడు పూజ అందుము.

—: విజయదశమి :—

బుద్ధుడు విజయదశమి రోజున జన్మించెను. అందువలన నీనాడు ఆమతస్థులమైన మనముగూడ విజయదశమి చేయుదుము.

మహావీరుని తదనంతరము ఈ జైన పీఠ మధిష్ఠించిన వాడు సుధర్ముడు. ఈతని తదుపరి మరి నలువ్రు రీ పీఠమునకు ప్రభువు లయిరి. సంభూతవిజయ, బధ్రిబాహువులనువారు జైన సంఘమునకు ఆచార్య పీఠస్థులైరి. ఇంచు మించుగా 200 యేండ్లు జరుగుసరికి ఇందు అభిప్రాయ భేదములు గలిగి శ్వేతాంబరులు, (కచ్చలవారు) దిగంబరులు (కుచ్చులవారు) అను రెండు శాఖలుగా విడిపోయిరి.

—: శైవమతము :—

(పాంచరాత్రి సిద్ధాంతము)

శైవమతము, రెండవ శతాబ్దమునకు చెందిన పతంజలి నాటికే (క్రీ॥ పూ॥ 150 సం॥) కానవచ్చుచున్నది. రుద్రుడు శుభములిచ్చు సమయమున శివశబ్దము పర్యాయపదముగ వాడబడుచున్నది.

రుద్రుడు క్రూరుడుగాను, మంగళకరుడుగాను గూడ తైత్తిరీయసంహితలో వర్ణింపబడినది. ఋగ్వేదమందు మాత్రం క్రూరుడుగానే వ్రాయబడియున్నది. మహాభారతములో నారా

యణీయోపాఖ్యానములో పశుపతి శాఖకు చెందిన శైవులను గూర్చి కలదు. శివుడు స్వయముగా వీర, శైవమత ధర్మములను బోధించినట్లు కలదు. స్వయముగా అనుటచే ఉమాపతి మానవుడే అనుటకు కొన్ని నిదర్శనములు కలవు. వాయు పురాణము 23 వ అధ్యాయమునందును లింగపురాణము 24 అధ్యాయము నందును చూడుడు.

యదువంశమున వాసుదేవుడు పుట్టు నప్పటికి శివుడు బ్రహ్మచారిగా "నకులేసు" డను పేరుతో ఉండెననియు ఇప్పుడు "కర్వాన్" అను స్థళముగా నిర్ణయింపబడిన కాయ వర్ధనమను గ్రామమున అవతరించెనని కలదు. ఈ కర్వార్ అను గ్రామము బరోడా ప్రాంతమున గలదు.

క్రీస్తు తరువాత మొదటి శతాబ్ద మధ్యమున శివుని యొక్క మానవ రూపమైన విగ్రహము "లేమి కేడ్ ఫిసిస్" అను చక్రవర్తి యొక్క నాణెములలోగలదు. ఇది శివుని అవతారమైన నకులేశునిది. ఈ నకులేశునిగూడా శ్రీకృష్ణ బౌద్ధ అవతారములుగా మనవారు మార్చినట్లు ఈతనిని శివుని చేసిరి. ఈ యుదంతము "ది కల్చరల్ హెరిటేజ్ ఆఫ్ ఇండియా" 7వ సంపుటము 16 పుట.

—: శ్రీ శంకరాచార్యులవారి జననము :—

ఈ శైవమత సాంప్రదాయములకు, చెందిన, కుటుంబములు మనలో చాల కలవు.

ఈ శైవమతాన లంబకులమగుటకును నకులేశ్వరునే ఈశ్వరునిగా మన మంగీకరించుటకును ఇచ్చటి ఆర్యులకు మనకు వక ఒడంబడిక జరిగినటుల ఊహించవలెను. శివునికి మా నాగవంశ చిహ్నముంచినయెడల శైవమత స్వీకారము చేయుదుము, అని అనుటచేతను, యెట్టులైన నగరులను, శివ సాంప్రదాయులుగా చేయుటయే, వారి ముఖ్యోద్దేశ మగుట చేతను, మన యిలవేల్పయిన నాగరాజును, శివునకు, కిరీటము గాను, ఆభరణముగాను, చేయుటచేతను. నాగరాజులు, చాల భాగమిందు చేరి, శివ సాంప్రదాయులైరి. మనలో చాలామంది కుటుంబములు, యజ్ఞోపవీతమును ధరించి, కర్మకాండ గడి తప్పకుండ చేయుచున్నారు.

ఇప్పుడు మనలో మధ్యను తక్షశిలా నగరమునుండి వచ్చి చేరిన "మజ్జు" లని పిలువబడు చున్నవారు, వివాహాది శుభకార్యములందు పితృకర్మలందు యజ్ఞోపవీత ధారులై వసిష్ట, గౌతమ మొదలైన మహర్షుల గోత్రీకులుగా నున్నారు. ఈ మత స్వీకారము నాటినుండియు బౌద్ధమత ధర్మములను పూర్తిగా మనవారు మరచిరి.

7 వ శతాబ్దమందు కాలడియను గ్రామమున మళయాళ బ్రాహ్మణ కుటుంబమున శ్రీ శంకరాచార్యు డుద్భవించెను. ఈతడు ఆసేతు హిమాచల పర్యంతము తిరిగి అద్వైత సిద్ధాంత మును ప్రచారముచేసి అఖండ విజయమును పొందెను. ఇతడు

బ్రహ్మచర్యము నందుండియే సన్యాసాశ్రమ స్వీకారియై, 32 ఏండ్లు మాత్రమే జీవించి ఈ పిన్న వయసుననే "స్మార్త" మతము (దీనినే అద్వైత మతమందురు) ప్రచారముచేసి మంచి ప్రచారములో నున్న బుద్ధ మతస్థులగు వారి నందరిని అద్వైతులుగా మార్చెను. ఇప్పుడు నూటికి యెనుబదిమంది హిందువులు, శైవ సాంప్రదాయులే. శ్రీ శంకరాచార్యులు హిమాలయముపై గల బదరికా వనములో మృతుడయ్యెను.

—: శాక్తము, శక్తి సాంప్రదాయము :—

వీరశైవమునకు చెందినవారలు కొందరీ శక్తిసాంప్రదాయమును లేపదీసి, కాళి, దుర్గ, అన్నపూర్ణ, నూకాలమ్మ, ముత్యాలమ్మ మొదలగు నామములను అంటించి, ఈశ్వరునికి భార్యలుగా చేసిరి. ఈ సాంప్రదాయమునకు మంత్ర—తంత్ర—యంత్రములను కల్పించి మహిమలను పొందవచ్చునని బోధించి, జంతుబలులు, మద్య, మాంస, మత్స్య, పేలాలు, స్త్రీ సంభోగము, అను పంచతత్వములను పంచరాత్ర సిద్ధాంతమని, వామాచారమని పేరుబెట్టి, గురువులు మెండుగా బయలుదేరిరి. ఇది అనాదినుండి వచ్చుచునే యున్నది.

1162 బిజ్జల (కల్యాణపురములోనిది) రాజునకు మంత్రియైన "బసవేశ్వరు" డను వాడు, బ్రాహ్మణుడు అయినను ఉపనయనములతో పనిలేదనియు, శివభక్తియె ప్రధానమనియు భోధించు జంగమమత మూల పురుషుడు.

ఈ మతము సేకరించిన, కొందరు యజ్ఞోపవీతముల వారిని చూచిన మండిపడెడివారు. దానితో చాలాభాగము యజ్ఞోపవీత ధారణములు అంతరించినవి. వారితో పాటు మన కులము లోను ఇదివరకున్న యజ్ఞోపవీతములు ఊడదీసిరి.

—: వైష్ణవ మతము :—

అంగీరసుని శిష్యుడైన కృష్ణుడనువాడు స్థాపించినదే వైష్ణవమతము. దీనికి భారతము, భగవద్గీత, భాగవతము అను మూడు గ్రంథములే బహుప్రమాణములుగా నున్నవి.

కృష్ణుడను పేరు వేదయుగమునాటి నుండి పౌరాణిక యుగమువరకు చాలమందికి కానవచ్చుచున్నది. ఇతడు హరి వంశములో కనబడు రాధాప్రియుడా? గోపికాలోలుడా? లేక చాందుగోపనిషత్తు నందు కాన్పించు దేవకీపుత్రుడా? మరే కృష్ణుడో? చరిత్రకారులే తేల్చవలసియున్నందున ఇచ్చట ఆచర్చ వదలితిని. వైష్ణవమతము వేదబాహ్యమై మొదటిలో యున్నను శ్రీకృష్ణుని ఆర్యులు అవతారపురుషుని చేసిన నాటనుండి ఈమతము వ్యాప్తిచెందెను. మనమీ మతస్వీకారమున ఆర్యులకు మనకు ఒక్క ఒడంబడిక జరిగినది. విష్ణువుకి తలపశయ్యగా మీ యిలవేల్పయిన శేషుని యుంచుదుమనియు, దైవము శేషుడగుటచేతను పరిపాలన నాగరాజులదే యైనను అప్పటికి ఆర్యులు అధికారములోకివచ్చుట చేతను, శేషునితో బాటువిష్ణువును పూజించునట్లు ఒడంబడిక గావించుకొనిరి. తదాది విష్ణు

వునకు నాగశయనుడను పేరుగలిగెను. అందువలన మనవారు విరివిగా ఆమతమందు చేరి పూర్వీకుల గోత్రమాతములకు దూర మైరి.

చెన్నపట్టణ సమీపములో గల శ్రీ పెరుంబత్తూరులో 11వ శతాబ్దమున (1037) రామానుజులు జన్మించి, కాంచీ పట్టణమున విద్యావ్యాసంగములు నేర్చి దేశ దేశములందు విష్ణుభక్తిని (మతమును) ప్రచారము చేసిరి. తిరుపతి దేవాలయ మును, లింగమునొసహా మార్చి వైష్ణవుల దేవాలయముగ చేసిరి. ఈతని ప్రబోధన లందచేసి భక్తివలననే ముక్తిగలదని అందులకు ప్రాయశ్చిత్తమవసరమని, చంక్రాంతములను పేర రెండుభుజములు కాల్చసాగిరి, దీనినే విశిష్టాద్వైతమత మందురు. ఈరామానుజ మతస్థులు, నాయెరుకలో మనవారిలో చాల మందికలరు. తదుపరి వీరు శైవమతస్థులుగా మారి బ్రాహ్మణా ధిక్యత, ఆరాధన మొదలిడిరి.

## —: హిం దూ మ త ము :—

ఈ భరత ఖండము నానా మతములకు ఆటపట్టయి హిందూమతము బయలుదేరినది. ఇందు ఉండువారు ఏ మత స్తులయినను మహమ్మదీయులు, క్రైస్తవులు గాక తదితరు లంద రూ హిందువులమనియే చెప్పుకొనుచున్నారు.

మహమ్మదీయ మతమునకు మహమ్మదు అను ప్రవక్త, క్రైస్తవ మతమునకు క్రీస్తు సంస్కర్తఅల్లే బౌద్ధ,

శంకర, రామానుజ, జైన, మొదలైన మతములకు మత సంస్కర్తలు కనిపించుచున్నారు గాని, ఈ హిందూ మతమునకు మాత్రము సంస్కర్తగాని, స్థాపకుడు గాని, స్థిరమైన మత ధర్మములుగాని కానరావు. ఈ విషయమై చరిత్రకారులు నేటివరకు పలుతెరంగుల చరిత్రాన్వేషణము చేయుచునే యున్నారు. కాని, యిదమిద్ధముగా నిరూపింపగల సాదృశ్యములు కానరావు. మన భారతదేశ మహానాయకుడైన "గాంధిమహాత్ముని" ఈ విషయ నిర్ణయము చేయవలసినదిగా ప్రార్థించెడి సదవకాశము నాకు చిక్కినది. అందులకు అనగా 'హిందూ' శబ్ద నిర్వచనము గూర్చి నవయుగ చరిత్రకు ఆది పురుషుడైన మహాత్ముడీవిధముగ నుడివెను. దానినే ఆంధ్రప్రభ (25 నవంబరు మంగళవారం 47 సం||) తేదీన ఎవరు హిందూ? అని మహాత్ముని నిర్వచనము.

న్యూఢిల్లీ నవంబరు 22.

మహాత్మా గాంధి నిన్న సాయంత్రము ప్రార్థనానంతరము యిలా వుపన్యసించాడు. 'హిందూ అంటే ఎవరు? ఇట్టివి చాల సమయోచితములైన ప్రశ్నలు. అయితే నేను చరిత్రకారుణ్ణి కాని, మహా మేధావినికాని కాదు. అయితే హిందూ మతానికి పరమ ప్రమాణములని చెప్పగల వేదాలను నేను చదివాను. ఆ గ్రంథాలలో హిందు అన్న పదము నాకెక్కడా కనపడలేదు. కాని, అలెగ్జాండరు చక్రవర్తి ఇండియాపై దండెత్తి వచ్చినప్పుడు సింధునదిని (ఇ. డస్) అని సింధుకు తూర్పున

ఉండే ప్రజలనందరిని హిందువులని పిలిచేవారని చరిత్రకారులు వ్రాశారు. సింధూ శబ్దంలోని 'యస్' అనే అక్షరం గ్రీకు భాషలో 'హెచ్'గా మారిపోయింది. ('ఇండస్') అనిదానితో వీరి మతము హిందూ మతమైపోయిందని, అన్ని మతాలలోకి హిందూ మతనే పరమత సహనానికి వన్నెకెక్కినదని వారికి బాగా తెలుసు. ప్రాణభీతితో పారిపోయి వచ్చిన క్రైస్తవులకు పార్సీలకు, యూదులకు హిందూదేశమే ఆశ్రయమిచ్చింది. సర్వ మత సహనానికి, విశ్వ ప్రేమకు వన్నెకెక్కిన హిందూ మతానికి చెందినవాడనని చెప్పుకోటానికి నేను ఎంతో గర్వి స్తున్నాను' అని పత్రికా ముఖముగా గాంధీజీ తమ సందేశాన్ని అందజేశారు. వారికి నా ధన్యవాదాలు.

మహాత్మాజీని నేను ప్రశ్నించినది హిందూమతమునకు గల ప్రవక్త ఎవరు? అన్నదానికి పైవిధముగ ప్రత్యుత్తరము అందగలిగితిని. అంతియే కాని సంతృప్తి నందనందులకు పై చరిత్రకారులే సాక్ష్యము.

ఇచ్చట నా చిన్నబుద్ధికి తోచిన వూహ కూడా నిర్వచించెద. ఇదియే నిర్ణయమని నేను సాహసించుటలేదు. నా విద్యుక్త ధర్మమగుటచే, నా ఊహాపోహాల లిఖించు చుంటిని. ఈ నానుడులు బలపరచుట, భావిచరిత్ర పరిశోధ కులకే వదలితిని.

ప్రథ మార్యులు ఉత్తర ధృవ ఖండమునుండి పదివే లేండ్లకు పూర్వమే జంబూద్వీపములోనికి చేరుకొని,

స్థిరులైరి. ఈ ఆర్య జాతికి ప్రభువు ఇంద్రు డగుటచే, వీరి తదుపరి రెండువేలేండ్లకు వచ్చిన ద్వితీయార్యులు, యీ దేశ మును ఇందు దేశమని నుడువ జొచ్చిరి. ఇంద్రుడు, తుఫానున కధిష్టాన దేవత యగుటచే వర్షము వచ్చుట, తుఫానుకు సాంప్రదాయమే. ఇంద్ శబ్దము వర్ష బిందువు అను మూలము నుండి, ఉత్పన్న మయ్యెను. వర్షారాధముచే సస్యసమృద్ధి గాంచుట ద్వితీయార్యులైన చంద్రవంశజులు తెలిసికో గలిగిరి. వర్షాదులులేనితరి యింద్రుని కేల, కొలుపులు చేయుటయేల ఈ దేశమునం దనుశ్రుతమైనది? ఈ యిందు శబ్దము ఈ దేశము ఇందుదేశమే అయి యుండవలెను, లేదా ద్వితీయార్యులైన చంద్ర వంశజుల పాలనలో యీ దేశమున్నప్పుడు, మహామ్మ దీయు లీదేశమును జయించు నాటికి, చంద్రవంశజుల రాజ్య మగుటచే, మహమ్మదీయ భాషయందు, ఇంద్ అనగా చంద్రు డై యుండుటచే మహమ్మదీయులీదేశమును ఇందుదేశమని పిలచి నైనను యుండనోపు. ఇందేదియు సిద్ధాంతీకరింప శక్తి చాల నందున భావిపరిశోధకులకు యీ భారము వైచినాడను.

నేటివరకు జరిగిన పరిశోధనల వల్ల చరిత్రకారులు, హిందూ శబ్దము పారశీక భాషలోనిదనియు, అనగా (మొగస్త నీసు) లోని దనియు చెప్పుచున్నారు. కాని యిదికూడ వారి అంతరాత్మకే నచ్చినట్లులేదు. వీరి మార్గమునే మహాత్ముడు గూడ, అనుసరించుట చరిత్ర చర్వణమై తోచుచున్నది.

---

# తక్షశిలా నగరము (టాక్సిలా)

ప్రాచీన నాగరికతను ఉగ్గుపాలతో పెంచిన నగరమే "తక్షశిలా నగరము". బౌద్ధ మతమునకు తల మానికమై వర్ధిల్లిన ఈ తక్షశిలానగరము యావద్భారత దేశమునకేగాక విశ్వమునకే బిక్ష పెట్టినదని ఘంటాపదముగా చెప్పవచ్చును. అట్టి ఈ తక్షశిలానగరములో గల "నగరాలు" అరువది నాలుగు కళలలోను ఆరితేరిన విద్యాకోవిదులైన వారనుటలో అతిశయోక్తి యెంతమాత్రము కానేరదు. ఈ నగర విశ్వ విద్యాలయమునకు గురువులై, గురుమూర్తులై, గురుమహాత్ములై, ఆచార్యులై, శీలభద్రులై, బౌద్ధ ధర్మోపదేశకులై, చెలువందినవారలే మన నగరాలు. మన నగర విశ్వ విద్యాలయము (యూనివర్శిటీ)లో శిక్షణ పొందిన శిల్పనైపుణ్యము దేశ దేశ దేవాలయ స్థూపములకు పారితోషికమై పరిఢవిల్లినది. ఆనాటి మన నగర విశ్వవిద్యాలయ వైద్య శాస్త్రమే స్వదేశ, విదేశములకు ప్రాణభిక్షం బెట్టినది. నేటికినీ ఆచార్య పీఠ మలంకరించిన మాకెన వారి వంశములో నుండి ఆయుర్వేద ఘంటారావము వినవచ్చుచునే యున్నది.

32 శాస్త్రములు, 64, కళలుగా విభాగింపంబడి విశ్వ విజ్ఞాన నాగమత భానోదయ భాండాగారమై వర్ధిల్లిన మన తక్షశిలా నగరము నేడు నామమాత్రావశిష్టమైనది. ఈ పవిత్ర నగర నామము ఏవత్ ప్రపంచమునా మారు మ్రోగుచున్నే

యున్నది. మన నగర విద్యాజిలుగు ప్రతి గ్రంథమున సువర్ణా క్షరములచే లిఖింపఁబడియే యున్నది. ఆ విశ్వ విద్యాలయ మున అలవడిన శిల్పనైపుణిని నేటికినీ మనచే విశ్వ జ్యోతియై ప్రకాశించుచునే యున్నది. ఆనాటి శిల్ప, ఆయుర్వేద, విజ్ఞాన బీజములే ఈనాటి నగర జాతికి కులవృత్తిగా నిలచిపోయినవి.

ఈ నగర విశ్వవిద్యాలయములో దేశ దేశములవారు విద్యాభ్యాసమును చేసిరను విషయమును చరిత్ర పాఠకులకు క్రొత్త విషయము కాదు. ప్రాచీన నాగరికతకు మన నగరాల మూల పురుషులైన "నాగరాజులే" ఆదిపురుషులు.

పంచవటీ ప్రదేశమునఁగల మన తక్షశిలా నగరనిర్మాత "తక్షకుడే" పంచనదులలో పవిత్రమైన "వితస్తానది" వేదము లందుఁసహితముఁ గొనియాడబడిఁ యున్నది. ఇచ్చట మెండుగ నాగరాజులు కాపురముండుతావు. భీష్ముఁడు అంపశయ్యపై నున్నప్పుడు కర్ణుఁడు చూడబోగా అతనికి ప్రదేశ వాసుల రణ పరాక్రమము తుది వాక్కులవల్లఁ దెలయఁబరచెను.

శ్లో॥ కర్ణా. రాజపురంగ............

హిమవద్గ నిలయా కిరాతా రణకర్కశాః

దీనినిఁ బట్టి చూడగా సహజ ద్వేషులగు ఆర్యులీ నాగ రాజులను కిరాతులుగా పోల్చి యుండిరి. ఇందులకు ద్వేషమే కారణము.

జనమేజయునిచే చేయఁబడిన నాగవధ తక్షశిలా నగరములో పరి సమాప్తి అయినట్లుల తెలియుచున్నది. ఖాండవవన దహనానంతరము తక్షకుఁడీ ప్రదేశమును జేరి ఈ నగర నిర్మాణముఁ గావించుకొనెను. గాని ఈ తక్షకుడనే పేరు చాలా పురాతనము నుండియూ వచ్చుచుండుటచే ఈ ఘన కార్యములు అన్నియూ ఒక్క తక్షకుఁడే ఆచరించె ననుట సాహసము. ఈ తక్షకుఁడను పేర్లు మన మూల పురుషులలో చాలామందికిఁ గానవచ్చుచున్నవి. ఇందు మొదటి తక్షకుఁడెవరో తెలిసికొనినఁగాని మిగిలినవారు ఎరుకపడరు.

భారత గాథలలో ప్రస్తావింపఁబడిన నాగ చరిత్రయందు గల సహస్రనాగముల యందలి ప్రముఖులలో "తక్షకు డొకఁడు" అష్ట నాగులలో పురాణ ప్రతీతినందిన తక్షకుఁడొకఁడు. పరీక్షిత్తునిఁ జంపించిన తక్షకుఁడొకఁడు. జనమేజయుని సర్పయాగములో మిగిలిన నాగరాజులలో ఇంద్రుని శరణుఁజొచ్చిన తక్షకుఁడొకఁడునూ గాన్పించుచున్నారు. ఏది యెట్లయిననూ, సాధారణముగా మన తాత ముత్తాతల పేర్లను మన సంతానమున కిడుట అనుశ్రుత ధర్మమే, ఇందాశ్చర్యము లేదు. ఇవా ప్రముఖ నామములతో అనేక నగరములు వెలసినట్లుల చరిత్ర ప్రసిద్ధమే !

రామాయణ ఉత్తరకాండ (114–201) యందు తక్షశిలను పేర్కొనిరి. భరతునిచే నిర్మింప బడినట్లుల గలదు".

వసుదేవుని సోదరుడైన "సృక్పని" జ్యేష్ట కుమారుడు వకడు తక్షకుడనువాడు గలడు.

(శ్రీ)రాముని సోదరుడగు భరతుని జ్యేష్టకుమారు డొకడు తక్షకుడు గలడు. ఈతడు పాంచాల దేశమున గల తక్షశిలను రాజధానిగా చేసికొని నటుల తెలియుచున్నది.

ప్రాచీన హిందూమత శాస్త్ర సాంప్రదాయముగా (మైతాల్ జి) వానుప్రభా అనే వానికన్ని, యోగసిద్ధ అనే ఆమెకు పుట్టిన సంతానములో, విశ్వకర్మ అనే వారొకరు. యింకను అనేక పేర్లు వారికి కలవు. దివాకరో, సుధన్వా, తక్షక వర్ధిక వీరు లలితకళా ప్రవీణులు. చిత్రలేఖనములో వీరు చిత్రించేటప్పుడు, తెల్లని మనిషి, హస్తములయందు త్రిశూలము కపాలము కలిగినటులు, ఎల్లోరా, నాసిక్ మొదలయిన స్థల ములయందు గలవు. ఎల్లోరాలో గల వక చిత్రలేఖనము 130 అడుగుల ఎత్తుగల మంచి పనితనము గలిగియున్నది. (ది సైక్లోపెడియా ఆఫ్ ఇండియా పేజి 1065 లో గలదు.)

ఈ నగర విశ్వ విద్యాలయములో గల విద్యార్థులకు ఏడు సంవత్సరములు వయస్సునుండియే శబ్దశాస్త్రము, వ్యాకరణము, తర్కశాస్త్రము, ఆధ్యాత్మిక శాస్త్రము, వైద్య శాస్త్రము, శిల్పశాస్త్రము, క్రమబద్ధముగా గురు, పండితులు శాసించి బోధించెడివారు. ఆనాడు తక్షశిలానగర విశ్వ విద్యాలయము, నలందా విశ్వవిద్యాలయము ఉత్తర దేశస్థులకునూ, అమరావతీ, కంచి, మధుర, మొదలైన పట్టణ

విశ్వవిద్యాలయములు, దక్షిణదేశీయులకునూ, ముఖ్యములై యుండెను.

తక్షశిలా నగరుల నాగరికతా గరిమ వర్ణనాతీతము. (నాగరికత అనగా సంఘములో నుండు కట్టుబాట్ల హద్దులు మీఱకుండుటయే) ఆనాటి ఆ నగర విద్యా వ్యాపకము చతుర్విధ పురుషార్థములతో చెలువొందుచుండుటకు ఈ నగర విశ్వ విద్యాలయములో ఏడువేల అయిదు వందలమంది విద్యార్థుల ననుసరించి విద్య నొసఁగు ఆచార్య బిరుదమందిన వారుఁగలరు. బహుశా మూకెనవారే అయి వుండవచ్చు. పదిహేను వందలమంది విద్యార్థులు యీ విద్యాలయములోనే కాపురముండి విద్యాభ్యాసముఁ జేసినట్లుల చరిత్రలవలన విశద మగుచున్నది. యీ నగర విశ్వవిద్యాలయాధిపతి (హెడ్మాస్టర్) కి శీలభద్రుడనే బిరుదు గలిగియుండెడిది. యీతఁడే ప్రధాన గురువు. యీ శీలభద్రుని వంశమువారే మనలోగల శీలము, క్షీరము, శీర, అను గృహనామములతో నున్నారు. ఉచ్చారణ యందుఁ గల స్వల్పబేధనేగాని పై నాలుగు పేర్లునూ శీలమునకే చెందియున్నవి.

యీ నగర విశ్వ విద్యాలయములో ఉత్తీర్ణులైన విద్యార్థులను పరీక్షించుటకై, "పరీక్షన్ మహాపాత్రులు" అను బిరుదుఁగల వారలు నియమింపఁబడి యుండిరి. పరీక్షన్ మహాపాత్రుఁడని, దళనాయక మహాపాత్రుఁడని, నగరమహా పాత్రుడనియూ బిరుదులుఁ గలవారు గలరని శాసన పరిశోధనల

వలనఁ దెలియుచున్నది. ఒక్కొక్క కళయందు తీర్ణులైన ఉపా ధ్యాయులకు వారి వారి పాత్రతకు తగ్గ, పాత్ర, మహాపాత్ర, బిరుదులు వుండెడివి. ఆ బిరుదములే మన నగరకులానికి అనుశ్రుతమై విద్యా విజ్ఞాన విశేషములు మాత్రము రూపుమాసి నగరకుల ప్రతిష్ట నేటికి నేతిబీరకాయ చందమైనది.

ఆచార వ్యవహారాలు కూడా మతములతోఁబాటు మార్పు చెందవలసి వచ్చెను. పాత్రుఁడనే బిరుదు మనకులమునకు ఆదిదే గాని క్రొత్తదికాదు. మహాభారతగాథకు పూర్వమే గల సహస్ర నాగరాజులలో "ఇలాపాత్రుడు" అను నాగ ప్రముఖుడుఁ గలఁడు. విద్యాధిక్యతంబట్టి, మహాంతులుగాను, గురుమూర్తులుగాను, ఆచార్యులు గాను, శీలభద్రులుగాను, పాత్ర మహాపాత్రులుగాను బిరుదులతో మన నగరకుల భాగ్యోదయ విజ్ఞాన వేత్తలను పిలుచుచుండెడివారు. యీ బిరుదు లన్నియూ మన కులమునకు అనుశ్రుతముగా వచ్చుచున్నవే గాని, అరువుతెచ్చి అతికించుకొన్న నెంతమాత్రమునూగావు.

పంజాబులోని రావల్పిండి జిల్లాకునూ, వాయువ్య పరిగణాలలో పెషావరు జిల్లాకునూ, "గాంధారము" అని పేరు. కాబూలు జిల్లాకూడా ప్రాచీన కాలమున గాంధార దేశములోనిదేనని కొందరు చరిత్ర కారులు నుడువుచున్నారు. జనమేజయ చక్రవర్తి యనంతరము యీ గాంధార దేశమునకు, బింబిసారుఁడు, అజాత శత్రువు, పాలకులైరి. యీ అజాతశత్రువుని కాలమందే "జీవకుఁడు" అనువాడు మన నగర విశ్వవిద్యా

లయమునందు వైద్య విద్య నభ్యసించిన, మహా భిషగ్రత్నము. యీతడీ నగర పాఠశాలయందు విద్యను ముగించి తన జన్మ భూమియగు మగధకుఁ బోవుచు పూర్వ మధ్యముననున్న, కాశీ, సాకేతము, ఉజ్జయినీ, నగరములందు గొప్ప రాజుల యొక్కయూ శ్రేష్ఠుల యొక్కయూ ఘన వ్యాధులకు చికిత్సఁ జేసి తాను విద్య నభ్యసించిన నగర విద్యాలయ ప్రవీణత వెల్లడిఁబరచి విరివిగా వారలచే సన్మానింపఁబడెను. బింబిసారుఁ డను రాజు యీతని వైద్య ప్రవీణతకు మెచ్చి తన ఆస్థాన వైద్యునిగా నియమించు కొనెను.

క్రీస్తుకు పూర్వము 6 వ శతాబ్ది యుత్తరార్థమున, ఇక్ష్వాకు వంశజుఁడైన "ప్రశేనజిత్తు" (పశేనజిత్తు) అను నతఁడు కోశలాధీశుఁడు. యీతఁడు మననగర విశ్వవిద్యాలయ మందు విద్యార్థిగా నుండి సకలవిద్యా పారంగతుడయ్యెను. యీతని సోదరియైన కోసలాదేవియే పై బింబిసారుని భార్య. ఇప్పటి "బీహార్" రాష్ట్రమందలి పాట్నా గయలు ఆక్రమించిన ప్రదేశమునకే పూర్వము మగధ అని పేరు. మహా భారత యుద్ధ కాలమునాటికి బృహద్రథ వంశజులైన జరాసంధాదులు మగధ ను పాలించుచుండిరి. దీనికి రాజధాని రాజగిరి (రాజగృహము) (గిరివ్రజము) అనికూడా దీనికి నామాంతరములుఁగలవు. ఇప్పుడు మనలోగల రాజగిరి గృహనామములు యీ దేశవాసులె.

బృహద్రధుల అనంతరము యీ దేశమునకు శిశునాగ వంశజులు ఏలికలైరి. వీరిలో అయిదవ రాజగువాడు బింబి సారుడు. యీతడు ప్రశాంనజిత్తునకు సమకాలికుడు. ఇంకనూ గణ రాజ్యములలో పేరుగాంచిన వజ్జి (మజ్జి) మల్ల, శాక్య, రాజ్యములు వీటిని పెక్కు రాజులు కలిసి పాలించుచుండిరి. వీటికే "నాయక సత్తాకములు" అని పేరు. ఇందులో వజ్జి జనపదమును యెనిమిది కులములవారు కలిసి పాలించుచుండిరి. వీరిలో విదేహులు, లిచ్ఛవులు, జ్ఞాతృకులు, వజ్జులు, (మజ్జులు) లేక వృజులు ముఖ్యులు.

పైన తెలిపిన "వజ్జి" కులజులే మనలోగల మజ్జులు. వీరొక శాఖగానే 1920 సం॥ వరకు నుండిరి. ఇందులోనివారే "మజ్జి" అను గృహనామము గలవారు. 'వా' అనునది ఉచ్చారణ సౌకుమారముకొరకు 'మ' గా మారినది. రెండవ వారగు 'మల్ల' శాఖీయులే మనలోగల 'మల్లరౌతు' 'మలురౌతు' 'మల్లోతి' మొదలగు గృహనామములు గలిగి యున్నారు. ఈ నాయక సత్తాక రాజ్యముల యందలిగల నగరులే ఈనాడు 'నాయులు' (నాయుడు) అని మనలో పిలువందుచున్నారు.

ఏకులమునకు ఆకులమునకు ప్రత్యేక రాజధానులుండి నను జనపదమున కంతకునూ రాజధానీ నగరము "వైశాలి". మల్లరాజ్యమునకు 'శిశునాగమును' 'పావా'యు ప్రధాన నగరములుగా నుండెడివి. శాక్యులకు "కపిలవస్తు" నగరము రాజధాని. బౌద్ధమతస్థాపకుడైన 'సిద్ధార్థుడు' ఈ శాక్య వంశస్థుడే.

లిచ్ఛవులునూ, మల్లులునూ కూడా బౌద్ధమత వ్యాపకమునకు యెక్కువగా దోడ్పడిరి. (హిందూదేశచరిత్ర, సూత్రయుగము, 45 వ పేజీ)

క్రీస్తుకు పూర్వము 322 వ, సం॥ న మౌర్యవంశమున 'చంద్రగుప్తుడు' పుట్టి తక్షశిలా నగరమును కూడా తన యేలుబడిలోనికి దెచ్చుకొనెను. క్రీస్తుకుపూర్వం చంద్రగుప్తుని కుమారుడు 'బిందుసారుడు' మగధరాజ్యమునకు పట్టాభిషిక్తుడయ్యెను. ఇతడు 27 యేండ్లు రాజ్యము పాలించి క్రీ॥ పూ॥ అంతరించెను.

బిందుసారుని యనంతరము ఈతని కుమారుడైన 'అశోక వర్ధనుడు' అయిన "అశోకచక్రవర్తి" పట్టాభిషిక్తుడయ్యెను. ఈతడు 40 సంవత్సరములు రాజ్యమేలి క్రీ॥ పూ॥ న కాలధర్మము నొందెను. ఈతని తదనంతరము ఈతనికుమారులకు ఒకరికొకరికిబడక కలహించుటచే సంయుక్తముగానున్న దేశమునకు చీలికలు ప్రారంభమయ్యెను. అశోకుని మరణానంతరము 'కళింగము' స్వతంత్రరాజ్యమయ్యెను. ఈ మౌర్యవంశము షుమారు 130 సం॥లు పాలించి క్రీ॥ పూర్వం 188 సం॥నకు తుదముట్టెను.

ఈ మౌర్య వంశపు చక్రవర్తియైన చంద్రగుప్తుని బుద్ధి విశేషములచే నేర్పడిన పరిపాలనా విధానమునే అశోకచక్రవర్తి చాలవరకు అనుకరించి ఆధర్మ సూత్రములలో గల ప్రధాన విషయములతో నూతన రాజ్యాంగ చట్టము నేర్పరచి తనపితామహుడైన చంద్రగుప్తుని అడుగుజాడలలో నడచెను. చంద్ర

గుప్త, అశోకచక్రవర్తుల పరిపాలనా నిర్వహణ విధానము గ్రీసు దేశపు రాయబారియైన 'మెగస్తనీసు' రచించిన గ్రంథ ములద్వారా అశోకుని పరిపాలన నిరంకుశమైనదని తెలియగలదు. సకల రాజ్యాంగ విషయములందు మార్పులు, కూర్పులు, తీర్పులు అతని చిత్తానుసరణి ఆచరించుచుండెడివాడు.

బిందుసారుని కాలమందు తక్షశిలానగర ప్రజలు ప్రభు త్వముపై తిరుగుబడినట్లునూ, ఆ తిరుగుబాటు నణచుటకై బిందుసారుఁడు తన తనూభవుఁడైన "అశోకుని" పంపెను. ఇతఁడు చతురంగబల సమేతుఁడై తక్షశిలానగరమును చేరగనే ఆ నగర ప్రజలు అశోకున కెదురేగి తమకు తమ రాజపుత్రుఁ డైన అశోకునియందుఁగాని ప్రభువైన బిందుసారునియందుఁగాని ప్రతికూలురము కామని, తమను నానా బాధలూ పెట్టుచున్న దుష్ట మంత్రుల బాధలు పడలేకుంటిమనియూ విన్నవించుకొ నిరి. ఈ లోపములన్నియూ సవరించుకొనుటకై అశోకుఁడు కొంతకాలము తక్షశిలానగరమున రాజ ప్రతినిధిగా పనిచేసెను. బిందుసారుఁడు ఇరువది సంవత్సరములు పాలించి క్రీ॥ శ॥ 273 సంవత్సరమున కాలధర్మ మందెను. చంద్రగుప్తుని కుమారుఁ డైన ఈ అమిత్రఘాత నామాంకితుడైన బిందుసారుని రాజ్యమున విశేషములు ఇంతకంటె యెక్కువ తెలియరావు. ఈ యుదంతము బౌద్ధ గ్రంథములవలనఁ దెలియుచున్నది.

ఈతని కుమారుఁడగు అశోకుఁడు రాజ్యమునకు వచ్చు సరికి మౌర్య సామ్రాజ్యము దక్షిణాపథమున ఇప్పుడున్న

"మైసూరు" రాజ్యము వరకునూ వ్యాపించి యుండుటచేతను అశోకుఁడు జయించిన మగధ సామ్రాజ్యమునకుఁ జేర్పగలిగినది ఒక్క కళింగమే యగుటచేతను, దక్కిను దేశము బిందుసారుని కాలముననే మగధాధిపతులకు వశమై యుండ వచ్చెను. మైసూరు రాజ్యపర్యంతము దక్షిణమునకు విస్తరింపఁ జేసినవాఁడు బిందుసారుఁడే.

క్రీ॥ పూర్వం 232–273 సం॥న॥ బిందుసారుని అనంతరము ఆస్రి కుమారుఁడైన అశోకవర్ధనుఁడు ఈతనిఁగూర్చి తెలిపెడి గౌతమ బుద్ధుని గాథలు సింహళ ద్వీప వృత్తాంతములే గాక అతడు స్వయముగా నెలకొల్పిన శాసనములు పెక్కులు గలవు. హిందూదేశమున గానవచ్చెడి రాజశాసనము లీతనివే గాన ఈతఁడు తక్షశిలానగర మందు రాజ ప్రతినిధిగా నున్నప్పుడు "డెరియస్" మొదలగు పాశ్చాత్య శిలాలిపులు యెరింగినవారు లనేకులతో పరిచయ ముండి యుండుటచే ఈ అశోకుఁడు వారి మార్గ మనుసరించి శిలాశాసనములు వేయుట మన దేశమునఁ బ్రవేశపెట్టిన ప్రప్రథముఁడు. ఈతనికి పెక్కండ్రు అన్నదమ్ములుఁ గలరు. తండ్రి గతించిన నాలుగేండ్లవరకు సింహాసనము నధిష్టించుటకై తమలో తాము కలహాపూరితులై యుండిరి. అశోకుఁడు రాజ్యమునకు వచ్చిన మరి నాలుగేండ్లకు గాని ఇతనికి పట్టాభిషేకము జరగలేదు. ఈతఁడు పట్టాభిషిక్తుఁడైన పన్నెండేండ్లవరకుఁ యీతనిఁ గురించిన వృత్తాంతములు దెలియలేదు.

యీతఁడు పట్టాభిషిక్తుఁడైన యెనిమిదవ యేట మాత్రము తన పూర్వుల మాదిరిగానే విజిగీషమునకై కళింగముపై దాడిజరిపెను. అప్పుడే అశోకునితోబాటు యీ "నగరాలు" (నాగరాజులు) తక్షసిలానగరమునుండి కళింగమునకు వచ్చినట్లు తెలియుచున్నది. భారత కాలమునుండియు యీ కళింగము రణవ్యాపారమున ప్రసిద్ధికెక్కెను. ఇందు గజములకునూ ఇంద్ర వనములకునూ అమూల్యాభరణములకు వలయు వజ్రములకునూ, యోషధీవిజ్ఞానమునను, ప్రఖ్యాతి గాంచినది. వైద్య విద్యయెడలనే తద్దేశీయులు ప్రత్యేకాభిమానము కనబరచుటవలననే కాలమానములకు "కళింగ పద్ధతి" అని ప్రత్యేకత సంపాదించగలిగినది.

అశోకుఁడు కళింగమును జయింప నుద్యుక్తుడై కత్తి దూసెను. అశోకసేనలకు కళింగసేనలకు ఘోర సంగ్రామము వాటిల్లెను. యీయుద్ధమువలన లక్షమంది యోధులు స్వర్గమలంకరించిరి. లక్షాయేబది వేలమంది కళింగ సైనికులు బంధించబడిరి. యీ విధముగా జయించిన కళింగ దుస్థితినిగూర్చి అశోకుడు అనేక తెరంగుల యోచించి తానొనరించిన హింసాకాండను తలంచి పశ్చాత్తాప హృదయుఁడై అహింసావ్రతమును చాటించెను. యీకళింగ విజయముతో మగధ, తక్షశిలా నగరములదాటి యవనరాజ్యము సరిహద్దు వరకూ వ్యాపించెను.

అశోకచక్రవర్తి తనరాజ్యమును పెక్కు జనపదములతోను, దుర్గములతోను వికసింపజేసి తన పితామహుడైన

చంద్రగుప్తుని నాటివలెనే మంత్రి పరిషత్తుల తోడ్పాటులతో పాలించుచుండెను. జనపదములలో తక్షశిలానగరము, ఉజ్జయినీ, తోసలి, సువర్ణగిరి మొదలైన రాజధానులుగాగల జనపదములు చాలాముఖ్యమైనవి. యీతని రాజకీయోద్యోగులలో 'రజ్జుకులు' (మజ్జులు) అను నొకతరగతి ఉద్యోగులుగుండెడివారు. వీరు ప్రజల నేరములకు తగిన శిక్షలను విధించుటకునూ, సత్కార్యములు ఆచరించు వారలకు బహూకరించుటకునూ అధికారులై యుండెడివారు.

కళింగదేశ విజయానంతరము అశోకచక్రవర్తికి బౌద్ధమతమందు తన హృదయము లగ్నమై తాను మొదట ఉపాసకుడుగాయుండి పిదప బౌద్ధసంఘమునజేరి మతస్వీకారము జేసి బౌద్ధభిక్షువై పరమపావనమైన బౌద్ధమత ధర్మమునకై తన జీవితమును వినియోగించెను. యీతనికి 'ఉపగుప్తుడు' అనువాడు బౌద్ధమతగురువు. యీ విధముగా మార్పుజెందిన అశోకమహారాజుయొక్క లక్ష్యముతో తన రాజకీయోద్యోగి వర్గమంతయు ధర్మపరతంత్ర మయ్యెను. "రజ్జుకులు' యీనాడు 'మజ్జులు' అనంబడెడి మన శాఖీయులు, యుక్తులు, మహామంత్రులు, వీరందరూ అయిదేండ్లకొక పర్యాయము రాజ్యపర్యటనము జేయుచూ ఇతర రాజ్యకార్యములతో బాటు బౌద్ధమత ధర్మమును బోధించుచూ, వ్యాపనము చేయుచుండవలెను.

అశోకవర్ధనిచే 'ఆంధ్రమహిష' (మైసూర్) మండలమునకంపబడిన మతబోధకుడు "మహాదేవ భిక్షువు". యీతడు

మగధ, మహాసాంఘికులకు నాయకుఁడు. యీతనియెడ అశోకునికి మహాగౌరవ ముండెడిది. యీమహాదేవభిక్షువు ఆంధ్రదేశమునకరుదెంచి చైత్యవాదమను పంథాను యేర్పరచెను. యీ మార్గమవలంభించిన బౌద్ధభిక్షువులు, "చైత్యకులు" అనియు, పేర్లుగలవు. కృష్ణానదీ తీరస్థమైన 'ధాన్యకటకము' (అమరావతి) యీచైత్యకులకు ప్రధాన నివాసస్థలము.

బుద్ధుడు 'రాజగృహము' మగధరాజ్యమునకు వచ్చి బిందుసారునకు బౌద్ధమతదీక్ష నొసంగెను. శిశునాగుఁడు మొదలు పదిమంది 360 సం॥లు మగధ రాజ్యమును పాలించిరి. శిశునాగులలో కడపటివాఁడగు 'మహాపద్మనందుఁడు' యీతనికి. మహాపద్మనందుఁడు, సుమాలి, మొదలగు యెనమండుగురు కుమారులు గలరు. మహాపద్మనందుఁడు అతని కుమారుఁలు నూరేండ్లు మగధను పాలించిరి.

యీ నవనందులను బ్రాహ్మణుఁ డొకఁడు ఘోరముఁగా మారణ యంత్రములఁ బన్ని క్రూరుఁడై చంపినవాఁడు "చాణక్యుఁడు". యీతఁడు రాజకీయ దురంధరుఁడై విషప్రయోగములను రాజులకు చేసి చంపుచుండు మహా కిరాత బ్రాహ్మణుఁడు. వీనివలన నాగ వంశీయులైన నవనందులు తుదముట్టిరి. వీరి యనంతరము మగధరాజ్యమునకు "చంద్రగుప్తుని" యీ చాణక్య బ్రాహ్మణుఁడే పట్టాభిషిక్తునిగావించెను. యీ మౌర్య వంశస్తులు పదిమంది మగధను పాలించిరి. వీటినిఁబట్టి చూడఁగా చంద్రగుప్తుని రాజ్యకాలారంభమునకు పూర్వము, 598 సం॥

నాడు జరాసంధుని వంశస్థుల రాజ్య మంతరించెనని తెలియ వచ్చుచున్నది. దేనిని మనము మగధ రాజ్యము అనుచుం టిమో దానినే ఋగ్వేద కాలమున "కీకట" దేశమనిరి. (శ్రీ) భాగవత దశమస్కంధ ద్వితీయాధ్యాయమున (శ్రీ) శుకుఁడు పరీక్షిత్తుతో ఇటులనుచున్నాఁడు. "ఓపరిక్షిత్తా! నీ జన్మమొదలు నందపట్టాభిషేకమువరకు 1115 సంవత్సరంబు లగును."

మహాపద్మనందుఁడు తన రాజ్యము అటు తక్షశిలా నగరము వరకు విస్తరింపఁజేసి ఉత్తర హిందూస్థానమంతయు ఏక ఛత్రముగా పాలించెను. "డెరియస్" పారశీకపు రాజులలో గొప్పవాఁడు. ఇతని సేనాధిపతియైన స్కైలాక్సే అను నతఁడు గాంధారమునుండి దక్షిణమున సింధునదీ ముఖద్వారమునఁగల దేశముసంతయూ స్వాధీనము జేసికొనెను. క్రీ॥పూ॥ 322, సం॥ "అట్టాల్" నగర ప్రాంతమున "అలగ్జాండర్" యెనుబది వేల మందికి పైగా గల సేనతో సింధునదినిఁదాటి తక్షశిలానగర మును ప్రవేశించెను. అకాలమున తక్షశిలానగర రాజ్య పాల కుఁడు "అంబీనృపాలుడు".

యీ అంబీనృపాలకునకునూ, అభిసార, పౌరవ, భూపతు లకునూ దీర్ఘ వైరము ప్రబలుచునే యుండెను. అభిసార మను నది తక్షశిలానగరమునకు యెగువ నున్న పౌరుగు రాజ్యము. "జీలం, చీనాబ్" నదుల మధ్య దేశము పౌరవునిది. యీ పౌరవ పదమే ఆనాఁడు 'యవన' మనంబడుచుండెను. 'పారస్'

అనియూ కూడా వ్యవహరించిరి. "బియాస్' నదికి తూర్పునఁ గల రాజ్యమే మగధ రాజ్యము. క్రీస్తు పూర్వము 323, సం॥ నందు బాబిన్ నగరములో అలెక్జాండర్ మరణించెను. యీతని తదుపరి చంద్రగుప్తుడు మగధ నేలిన ః డసారి నందునకు 'ముర' యను ఒక సూద్ర స్త్రీ యందు జనించినవాఁడు.

యీమగధరాజ్యమునకు 'పాటలీపుత్రము' రాజధాని. ఇది గంగ, శోణా, నదుల సంగమస్థలమునఁ గలదు. దీని పొడవు తొమ్మిది మైళ్ళకు మించి యుండెను. వెడల్పు రమారమి ఒకటిన్నర మైలుండెను. నగరము చుట్టూ దారమయు, ప్రాకారము కలదు. దీని లోపలనుండి ధనుష్కులు వెలుపలఁగల శత్రువులపై బాణములు వేయుటకు రంధ్రములు గలవు. ఇందుండువారు వడిపెన అను విలువిద్యా నిపుణులు యీ ప్రాకారము చుట్టునూ నుందురు. యీదుర్గ సంరక్షణగా అరువది అడుగుల లోతునూ, రెండువందల అడుగుల వెడల్పునూఁగల కందకము గలదు ప్రాకారము పొడుగునా ఏనూట డెబ్బది బురుజులునూ, అరువది నాలుగు ద్వారములునూ గలిగి నగర పరిపాలనకుఁగాను ముప్పదిమంది గల నొక పరిషత్తుఁగలదు. (పరీక్షన్ మహాపాత్రులు) వ్యవహార సౌకర్యమునకీ పరిషత్తు సభా సభ్యులు అయిదుగురు చొప్పున ఆరు సంఘములుగా నేర్పడి సంఘమునందలి వేరు వేరు పనులు చక్కఁబెట్టుచుందురు. వీరలనే పంచపాత్రులందురు. నగరాధిపతికి నాగరికుడు అని పేరు. యీ పేరే నగరాల కులముగా మారినదేమో!

పరిపాలనా నిర్వాహణమునకు యీ నాగరికుల స్థానికులు, గోపులు అను ఉద్యోగు లుందురు.

చంద్రగుప్తుని కాలములో పెద్ద పెద్ద నగరములయందు పెక్కు వృత్తులవారు యుండియుండిరి. అందు వర్తకులు, రాజ, పణ్యా, ద్రవ్య, నియుక్తులుగనూ, బెహారులుగనూ, (బెనర) యుండిరి. వీరిలో భాగ్యవంతులకు శ్రేష్టులు అని పేరు. అందుకు తగ్గిన వారలను కసిశెట్టి అని వ్యవహరించెడివారు. వీరు వర్తక సంఘమునకు ప్రథమ శ్రేణికి చెందినవారు.

అతని ఆజ్ఞలు తనప్రధాన రాజకీయోద్యోగుల ద్వారా క్రింది అధికారులకు తెలియబడు చుండెడివి. అట్టి ప్రధానరాజకీయోద్యోగులకు శిఖరములుగా ప్రతినిధులు యుండెడివారు. ఆప్రతినిధుల స్థానములలో రాజపుత్రులుగాని సన్నిహిత బంధువులుగాని నియమింపబడెడివారు. వారిలో ఒకడు ప్రఖ్యాత్యవంతమైన 'తక్షశిలానగరములో నుండెడివాడు. ఇట్టి ప్రసిద్ధమైన తక్షశిలానగరము యీనాడు రావల్పిండి జిల్లాలో సాలిధేరి అనుచోట పాడుపడియున్నట్లు కనిపెట్టిరి. 'శతద్రు' నదికి బడమరగా 'హిందూకుష్' పర్వతముల వరకుగలప్రదేశమంతయు తక్షశిలానగర ప్రతినిధి పాలనలోనుండి యుండెడిది (అశోక చరిత్ర 7 అ॥ 99 పే॥ to 100 వరకు.) యీనగరము క్రీస్తు వెనుక వకటవశతాబ్దమున కూడా యూనివర్సిటీయందు విద్యావ్యాసంగములు జరుగుచునే యుండెను. ఇందు వైద్య, శిల్ప,

మొదలుగాగల లలితకళా విద్యలకే కేంద్రముగాక ధనుర్విద్యయు యిచ్చట నేర్పుచుండెడివారు.

తక్షశిలా నగరమునకు పడమరగా నిర్మింపబడిన మాణి ఖ్యాస్థూపము రావల్‌పిండి జిల్లాకు దక్షిణముగా 14 మైళ్ళలో గానవచ్చుచున్నది. యింకను త్రిగర్తదేశమున జాలంధరుడు గంగాపుత్రుడనియు (పద్మపురాణం పే. 50) యీతడుండునదే జాలంధరపురమనియు యిదినకప్పుడుముఖ్యనగరముగాయున్నను దీనికి కొన్నినాళ్ళు నగరికోటరాజధానియనియు తెలియుచు న్నది. యీనగరికోట జలందర్, దోఆబ్‌నందు కోహిస్థాన మనంబడు హద్దులలో గల మంజీనది బాణగంగలో గలయు సంగమస్థళమున గల నగరము. ఇచ్చట వజ్రేశ్వరీపీఠము దేవీక్షేత్రము గలవు. యీ నగరికోట శత్రు వులకభేద్యమైనది. కోటలోనే దేవస్థానము గలదు. నుసరామ నగరమని వక నగరముకలదు. అందుమూడుగోతులు త్రవ్వించి నటులను జీనాబ్, జీలం, అట్లీ నదుల పాయనటుల చేసెననియు యీ మూడుగోతులు త్రవ్వించినవారే యీనాటి నాగోతి వారనియు ఒక అనుశ్రుత గాధ కలదు. యింకను గాంధార దేశమున నగరహారపురమను నది వకటి గలదు. ఇది ప్రస్తు తము పల్లెగాయున్నది.

షాలిధేరి, శిర్కాఫ్, శిర్యాక్, కచ్‌కోట్, అను గ్రామములు కలవు. కాలకాశె, రైల్వేస్టేషనుండి రెండు మైళ్ళ దూరమునను, రావల్‌పిండి జిల్లాకు 26 మైళ్ళదూరము

నను, భూగర్భమున కలసిన తక్షశిలానగర దిబ్బలు కనుపించు చున్నయవి. యీ దిబ్బయే విశ్వవిద్యాలయముండు తావు. సిర్కాఫ్ గ్రామమునుండి 4 మైళ్ళ దూరములో తొల్లింటి తక్షశిలానగర బహిఃప్రదేశము గాన్పించును. దీని చుట్టూ చిన్న గదులున్న ఆనవాళ్లు గలవు.

యీ అనుశ్రుత గాథ తక్షశిలానగరాన్నుంచి ప్రయాణంచేయించి అనుశ్రుతంగా వస్తున్న తక్షశిలానగరాన్ని యీ వ్యాసంలో సాకల్యంగా నిరూపించి నగరా లనిపించుకున్నాం.

లెక్కకు మిన్నయైన చరిత్రాది గ్రంథములనుండి ఎత్తి, నా స్వకపోల కల్పన చూపక, యథాతథాగా యిస్తూ, చరిత్రాంశములు జాతిపరంగా సమన్వయము చేయుపట్ల స్వతంత్రించితిని.



—: తెప్ప రేవున దిగినవారు :—

ఈ రేవున దిగినవారిలో భాయునవా రొకరు. వంశ జ్ఞాతులయిన పట్టెన్న పాత్రుడుగారు వీరి కుమారుడు. సన్నయ్యపాత్రుడుగారు, వీరూ విశాఖపట్టణం కొండపైనగల వేంకట రమణాలయ ధర్మకర్తలు. యీ ఆలయము పట్టెన్న పాత్రుడు గారిచే కట్టించబడినది. యీ సన్నయ్య పాత్రుడుగారు నూటపదునొకండు సంవత్సరములు జీవించి అమరజీవులయిరి. నేడీ వేంకటరమణ ఆలయమునకు శ్రీ గుజ్జారువారు ధర్మకర్తలైరి. సాంగోపాంగముగా నాచే రచింపబడిన నాగరాజ వంశమందు తమని తమరు తెలుసుకొనండి. యీ గ్రంథము నానామత జాతులకు జ్యోతిలాంటిది. సర్వదేశములకు స్తూపమని మరువకండి. జగము పుట్టినదాది నేటినవయుగమువరకూ గల చరిత్ర మార్పులు, ఇందు తిలకించండి. నగరాల అనుశ్రుతగాథ ఇంతటితో అక్షయ మందినది.

"సంఘం శరణామి–బుద్ధం శరణామి"

ఇట్లు,
ధన్వంతరి:
సత్యాల నరసిబాబు పాత్రుడు,
స్వర్ణకంకణ ఔషధాలయము.
తూర్పువలబావి వీధి విజయవాడ.